# హనుమంతుడు

## ఆదర్శంగా వ్యక్తిత్వ నిర్మాణం

(హనుమాన్ చాలీసా సహితం)


రచన

అమిరపు నటరాజన్


సలహా మండలి

| | |
|---|---|
| అమిరపు సురేష్ | సి. శ్రీధర్ I.A.S |
| డా. టి.జి.కె.మూర్తి | ఆచార్య పి. శ్యామసుందరమూర్తి |
| డా. శ్రీమతి సి.హెచ్. చిరంజీవి | ఆచార్య బి. నాగలింగం |
| సి.వి.బి సుబ్రహ్మణ్యం | నెమ్మాని రామగోపాల్ |
| | కె.వి. రామగోపాల శర్మ |


ప్రకాశకులు

శ్రీరామకృష్ణ సేవా సమితి

బాపట్ల - 522 101

# ప్రకాశకుల మనవి

మురిపించి మైమరిపించే మాటలు చెప్పి పబ్బం గడుపుకోగలిగే మనిషిదే బహుగొప్ప వ్యక్తిత్వం అని ఆధునిక ప్రపంచం భావిస్తోంది. తియ్యతియ్యని మాటలతో అందరినీ బుట్టలో వేసుకోగలగడమే గొప్ప పర్సనాలిటీని సూచిస్తుందనే అపోహ చాలామందిలో ఉంది. ఇంగ్లీషులో ఒక సామెత ఉంది – "మీరు కొంతమందిని ఎల్లకాలం మోసం చెయ్యవచ్చు, అందరినీ కొంతకాలం మాయలో ముంచవచ్చు, కానీ అందరినీ ఎల్లకాలం మోసగించలేరు." పులితోలు కప్పుకున్న గాడిద కథ మన అందరికీ తెలిసినదే. కాబట్టి మనం పరిపూర్ణమైన మానవులుగా ఎదగాలి. అది ఎలా?

"చెప్పిన బుద్ధి, దిద్దిన అందం ఎంతో కాలం నిలువవు" అని తెలుగులో ఒక సామెత ఉంది. వ్యక్తిత్వ నిర్మాణం అంటే పైపై మెరుగులు మాత్రమే కాక మన లోలోతులలో ఉన్నదేదో ఒకటి వికసించాలి. దాన్ని మనమే ప్రయత్నపూర్వకంగా నిర్మించుకోవాలి. అది ఏమిటి? దానిని వికసింపజెయ్యడం ఎలా? ఈ విషయంలో హనుమంతుడి ప్రస్తావన ఎందుకు? వివేకానంద స్వామి ఈ విషయంలో మనకు చేసిన హితబోధలు ఏమిటి? అనే ప్రశ్నలకు సమాధానాలను చర్చించడం ద్వారా మన వ్యక్తిత్వాలను ఎలా నిర్మించుకోవాలో, మలచుకోవాలో, వికసింపచేసుకోవాలో చెప్పడమే ఈ పుస్తకం యొక్క లక్ష్యం.

ఈ పుస్తకంలో హనుమంతుడి గురించిన విషయాలు వాల్మీకి రామాయణం ఆధారంగానూ, మిగిలిన భావాలన్నీ వివేకానంద స్వామి బోధనల స్ఫూర్తితోనూ వ్రాయబడ్డాయి. ఈ పుస్తకంలో తరచుగా వాడబడిన 'స్వామీజీ' అన్న పదం వివేకానంద స్వామిని సూచిస్తుంది.

ఈ పుస్తక రచయిత అమిరపు నటరాజన్‌కు మా కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని మరింత చక్కగా తీర్చిదిద్దడానికి తమ అమూల్యమైన సలహాలను అందించిన శ్రీ అమిరపు సురేష్, శ్రీ సి. శ్రీధర్ I.A.S, డా.టి.జి.కె.మూర్తి, Out-standing scientist, ISRO, Bangalore, ఆచార్య పన్నాల శ్యామసుందర మూర్తి, కన్వీనర్, ఆంధ్రప్రదేశ్ రామకృష్ణ వివేకానంద భావప్రచారపరిషత్, శ్రీ నెమ్మాని రామగోపాల్, Asst. Professor, బాపట్ల ఇంజినీరింగ్ కాలేజ్, డా. శ్రీమతి చిరంజీవి, Senior Scientist, ANGR వ్యవసాయ విశ్వవిద్యాలయం, ఆచార్య బి.నాగలింగం, ANGR వ్యవసాయ విశ్వవిద్యాలయం, శ్రీ సి.వి.బి సుబ్రహ్మణ్యం, Officer, LIC, కె.వి.రామగోపాల శర్మ, Lecturer, SAWBJ College, ప్రభృతులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

హనుమంతుణ్ణి గురించి మరింత తెలుసుకోవడం కోసం వాల్మీకి రామాయణాన్ని చదవండి, మరింత ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని నిర్మించుకోండి!

ఆగష్టు, 2006 — ప్రకాశకులు



SRI RAMAKRISHNA MATH
RAMAKRISHNA-VIVEKANANDA NAGAR
SWAMI VIVEKANANDA ROAD
RAJAHMUNDRY-533 105

Phone : 473112
E-mail : rkmrjy@rediffmail.com

# ముందుమాట

హనుమంతుడి మీద వ్రాయబడిన ఈ చిన్న పుస్తకం ఇంతవరకూ చూడని ఒక కొత్తకోణంలో హనుమంతుణ్ణి మన ముందుంచుతుంది.

ఇంతవరకూ మనం చూసిన హనుమంతుడు 'బాష్పవారి పరిపూర్ణలోచనుడై' - అంటే భక్త్యావేశంతో కన్నులలో నీరు నింపుకునే భక్తుడుగా మనకు కనిపిస్తాడు. సంజీవనీ పర్వతాన్ని పెకలించుకు రావడం, సముద్రాన్ని లంఘించడం, లంకాదహనం మొదలైన ఘట్టాలలో మినహాయించి హనుమంతుని వ్యక్తిత్వంలోని ధీరత్వాన్ని, కార్యశూరత్వాన్ని మనం పూర్తిగా మర్చిపోయాం. కానీ అటువంటి ఘనకార్యాలను హనుమంతుడు తన 'బాష్పవారి పరిపూర్ణ లోచనాల'తోనే సాధించగలిగేవాడా? లేదు, అది సాధ్యం కాదు. పూజ్య స్వామి రంగనాథానందజీ మాటల్లో చెప్పాలంటే హనుమంతుడు సంపూర్ణమైన పరిణతిని సాధించిన మనిషి - అంటే 'పరిపూర్ణుడైన వ్యక్తి'. వివేకానంద స్వామి హనుమంతుడు తన జీవితంలోని ప్రతి కదలికలోనూ దివ్యత్వాన్ని ఉట్టిపడేలా చేసి చూపాడని కీర్తించారు.

హనుమంతుడే మన దేశపు యువతకు ఆదర్శం అని వివేకానంద స్వామి తన ఉపన్యాసాలలో ప్రకటించారు. కానీ మనకు నిత్యం దొరికే సాహిత్యంలో, హరికథలలో వినిపించే వర్ణనలలో, కనిపించే హనుమంతుడి వ్యక్తిత్వం భారతదేశంలోని అందరు యువతీయువకులకూ ఆదర్శం కాగలదా అని పలువురు సందేహిస్తూ వచ్చారు. ఈ పుస్తకం అటువంటి సందేహాలనూ, అపోహలనూ తొలగిస్తుంది. ఈ పుస్తకంలో హనుమంతుడి వ్యక్తిత్వాన్ని వర్ణిస్తూ, అతడి జీవితంలోని ఆసక్తికరమైన, స్ఫూర్తిదాయకమైన అంశాలతో వివేకానంద స్వామి బోధనలను జోడించి ఆధునిక యువత మనస్సుకు నచ్చే విధంగా శ్రీ అమిరపు నటరాజన్ మన ముందుంచారు.

తమ జీవితాలకు దారిచూపగల ఆదర్శమూర్తి కోసం అన్వేషించే యువతకు ఈ పుస్తకం తప్పక స్ఫూర్తిని అందించగలదని ఆశిస్తున్నాను.

Swami Aksharatmananda

(స్వామి అక్షరాత్మానంద)
అధ్యక్షులు, రామకృష్ణ మఠం
రాజమండ్రి

# విషయసూచిక

# 01. వ్యక్తిత్వం అంటే ఏమిటి?

ఒక వ్యక్తిని గురించి చెప్పమంటే మీరు ఏమి చెపుతారు? అతడు ఎలా మాట్లాడతాడో, ఎలా ప్రవర్తిస్తాడో వివరిస్తారు. అంతే కదా! అంటే వ్యక్తిత్వంలో ఉండే ముఖ్యమైన అంశాలు మాటలు, చేతలు. ఇవి ఎక్కడ నుంచి పుడతాయి? ఇవి ఆలోచనలలో నుంచి పుడతాయి. కాబట్టి మీరు బహుశా అతడి ఆలోచనల గురించి కూడా కొంత వ్యాఖ్యానిస్తారేమో. కాబట్టి మొత్తం మీద ఒక వ్యక్తి యొక్క వ్యక్తిత్వాన్ని గురించి మాట్లాడవలసి వచ్చినప్పుడు మనం అతడి మాటలు, చేతలు, ఆలోచనలను గురించి మాట్లాడతాం.

వ్యక్తిత్వంతోపాటు శీలం (స్వభావం) అనేది కూడా ఒక ముఖ్యమైన మాట. ఇవి రెండూ ఒకే అర్థాన్ని సూచించేవే అయినా ప్రస్తుతం మనం అర్థం చేసుకోవడానికి వ్యక్తిత్వం కంటే శీలం అనేది ఇంకొంచెం లోతైనది అని అనుకుందాం. వ్యక్తిత్వం ఒక మనిషిలో ప్రస్ఫుటంగా పైకి కనిపించేది అయితే శీలం మరింత లోతుగా ఉండి, మరింత లోతైన పరిశీలన వల్ల మాత్రమే బయటపడుతుంది.

మరొకవైపు, వ్యక్తిత్వం అంటే మనిషి ఎంత అందంగా ఉన్నాడో చెప్పేది కాదు. బట్టలు ఎంత చక్కగా ఉన్నాయి, ఎంత చక్కగా తల దువ్వుకున్నాడు అన్నది కాదు. అవి కూడా ముఖ్యమే కానీ, కేవలం

అవే ముఖ్యం కావు. ఆడవారి కట్టూబొట్టూ విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది. వివేకానంద స్వామి (స్వామీజీ) పాశ్చాత్యదేశాలలో మాట్లాడుతూ, "మీ దేశంలో ఒక టైలర్ ఒక 'జెంటిల్ మేన్'ని తయారుచేస్తాడు. మా దేశంలో ఒక మనిషి వ్యక్తిత్వమే అతణ్ణి గౌరవనీయుడిగా చేస్తుంది" అని చెప్పారు.

వ్యక్తిత్వం అంటే ఏమిటో, పరిపూర్ణమైన వ్యక్తి అనేవాడు ఎలా ఉంటాడో స్వామీజీ విస్తారంగా వివరించారు. వ్యక్తి స్థాయిలోనూ, సామాజిక స్థాయిలోనూ మాత్రమేకాక అణగారిన వర్గాల అభివృద్ధిని సాధించడంలోనూ, తద్వారా దేశప్రగతినీ, నిజమైన స్వాతంత్ర్యాన్నీ సాధించడం కోసం, వివిధ స్థాయులలో మనుష్యుల వ్యక్తిత్వాన్ని ఎలా అభివృద్ధి చెయ్యాలో ఆయన గొప్ప ముందు చూపుతో వివరించారు. వ్యక్తిత్వం గురించి వివేకానంద స్వామి బోధనలన్నింటినీ క్రోడీకరించినట్లయితే మనం దానిని ఇలా ఒక సూత్రం రూపంలో వ్రాయవచ్చు.

చెప్పిన మాటలను (హారం) ఎంత వరకూ చేసి చూపిస్తున్నారన్న దానిని (లవం) ఒక నిష్పత్తి రూపంలో వ్రాశామనుకోండి. అప్పుడు ఒక మనిషి తాను ఆడిన మాటను తప్పకుండా ఎంతవరకూ చేతలలో చూపిస్తున్నాడో ఆ సూత్రం ద్వారా అంచనా వెయ్యవచ్చు.

$$\text{వ్యక్తిత్వం} = \frac{\text{చేతలు}}{\text{మాటలు}}$$

ఈ సూత్రాన్ని మీరు దైనందిన జీవితంలో ప్రయోగించి చూసినప్పుడు అధికశాతం మనుష్యులలో ఆ నిష్పత్తి విలువలు ఎప్పుడూ ఒకటి కంటే తక్కువగానే ఉంటాయని గమనించవచ్చు. మామూలు మనుష్యులందరూ ఈ స్థితిలోనే ఉంటారు.

ఆ విలువ ఒకటి కంటే తక్కువగా ఉంటే ఆ మనిషి మాట్లాడిన మాటల్ని తన చేతలలో పూర్తిగా నిలబెట్టుకోలేకపోతున్నాడని అర్థం. దుర్మార్గుల విషయంలో మాట్లాడేది ఎక్కువ, ఆచరించేది తక్కువ అనీ, లేకపోతే చెప్పేది ఒకటి, చేసేది మరొకటి అని అర్థం.

తన మాటల్ని పూర్తిగా చేతలలో చూపేవాడికి అంటే "ఆడి తప్పనివాడికి" ఈ నిష్పత్తి ఒకటి అవుతుంది. అప్పుడు ఆ మనిషి ఒక **పరిపూర్ణమైన వ్యక్తి** – పూర్తి నిజాయితీ గలవాడు – అవుతాడు.

దీనినే ఇంకా కొంచెం ముందుకు తీసుకువెళ్ళి ఒక వ్యక్తి శీలాన్ని కూడా ఒక సూత్రం రూపంలో రాస్తే

$$\text{శీలం} = \frac{(\text{చేతలు} + \text{మాటలు})}{\text{ఆలోచనలు}}$$

ఇలా చెప్పిన మాటలను చేతలలో చూపడమే కాక మనస్సులో ఏది ఆలోచిస్తాడో దానినే మాట్లాడి, దానినే చేతలలో చూపగలిగే వ్యక్తి ఎంత గొప్పవాడో ఊహించడానికి ప్రయత్నించండి.

అలా ఎవరైతే తన మాటల్ని, చేతల్ని తన ఆలోచనలతో సమానం చెయ్యగలుగుతాడో అంటే ఏది ఆలోచిస్తే దానినే

మాటలలో, చేతలలో చూపుతాడో అతడు అత్యున్నతుడైన శీలవంతుడవుతాడు.

మరొకవైపు నుంచి చూసినప్పుడు ఈ నిష్పత్తి విలువ కనుక ఒకటి కంటే ఎక్కువ ఉంటే ఆ వ్యక్తి అతిగా ప్రవర్తించేవాడు, లేకపోతే పిచ్చివాడు అయివుంటాడు. (మహాత్ములైన మనుష్యుల విషయంలో ఈ సూత్రాలు కొన్ని సందర్భాలలో వర్తించవు. అయితే మనలాంటి మామూలు మనుష్యుల అవసరాలకు చాలావరకూ సరిపోతాయి.)

స్వామీజీ, “మీ ఆలోచనలను, మాటలను ఒకటిగా చేయగలిగితే, – నేను మరొక్కసారి ఘంటాపథంగా చెపుతున్నాను – మీ మాటలను, చేతలను సంపూర్ణంగా ఒకటిగా చెయ్యగలిగితే మీ కాళ్ళ దగ్గరికి డబ్బు ధారాళంగా ప్రవహిస్తుంది” అని చెప్పిన మాటలను ఇక్కడ మనం గుర్తు చేసుకోవచ్చు. ఆ మాటలకు అర్థం మీరు తలపెట్టిన పనులన్నింటినీ సాధించగలుగుతారనే. ఇచ్చిన మాటను నిలబెట్టుకునే వ్యక్తికి ఎదురుండదు. వ్యక్తిత్వ నిర్మాణం గురించి, శీలనిర్మాణం గురించి వివేకానంద స్వామి ఇలా ఒక్క మాటలో తేల్చి చెప్పారని అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

## 02. అసలు వ్యక్తిత్వం గురించి చర్చ ఎందుకు?

భారతదేశం ఒకప్పుడు ప్రపంచంలోనే అత్యంత సంపన్నమైన

దేశం. ఇక్కడి ప్రజలు అన్ని రంగాలలోనూ ప్రపంచంలోనే అత్యుత్తములుగా కీర్తించబడ్డారు. భారతప్రజలు నీతినిజాయితీలకు మారుపేరైనవారనీ, అద్భుతమైన వ్యక్తిత్వం గలవారనీ, అత్యంత నమ్మకస్తులనీ, దానగుణ సంపన్నులనీ మెగస్తనీస్, హుయాన్‌సాంగ్, పాహియాన్ మొదలైనవారు కీర్తించారు.

అయితే, అటువంటి దేశం నేడు దిగజారిపోయింది. దేశంలో సగం జనాభా నిజమైన చదువులేక పేదరికంలో మగ్గుతున్నారు. ప్రపంచదేశాలలో ఎక్కువ అవినీతిగల దేశాలలో ఒకటిగా మనదేశం చెడ్డపేరు తెచ్చుకుంది. ఇలా ఎందుకు జరిగింది?

“ఈనాడు ప్రపంచంలో గొప్ప దేశాలుగా చలామణీ అవుతున్న దేశాల పూర్వీకులు తమ ముఖాలకు నీలం రంగు పులుముకుని తిరుగుతున్న కాలంలోనే, మన దేశంలోని ఋషులు అత్యున్నత సత్యాలను ఆవిష్కరించారు. అయితే ఇలా కనుగొనబడిన గొప్ప సత్యాలు తర్వాత కాలంలో సరిగా ఆచరణలో పెట్టబడకపోవడం వల్లనే ఈ దిగజారుడుతనం దాపురించింది” అని స్వామీజీ చెప్పారు.

“ఒక దేశంలో మనుష్యులు ఎంత గొప్పవారైతే ఆ దేశం అంత గొప్పదవుతుంది. ఒక దేశం దిగజారిపోయిందంటే దానికి అర్థం ఆ సమాజం గొప్ప వ్యక్తులను తయారు చెయ్యలేకపోతోందనే” అని స్వామీజీ చెప్పారు.

అంతేకాక భారతదేశం ప్రపంచ దేశాల నడుమ తిరిగి తన పూర్వపుస్థితిని చేరుకుంటుందని ఆయన భవిష్యత్తును చెప్పారు. అయితే దీనికోసం మనం మన చరిత్రను లోతుగా అధ్యయనం చేసి, దాని ఆధారంగా మన వ్యక్తిత్వాలను రూపొందించుకుంటే తప్ప తిరిగి మన దేశానికి అటువంటి స్థితి కలగదని ఆయన హితవు పలికారు.

## 03. మన వ్యక్తిత్వంలోని లోటుపాట్లు ఏమిటి?

నిజంగా తెలివిగలవాడు ఎవడు? తాను చేసిన తప్పుల్ని ఒప్పుకోగలిగేవాడు. వాటిని సరిదిద్దుకోవడానికి సిద్ధపడేవాడు. ఆ విధంగా ఆ మనిషి తన వ్యక్తిత్వాన్ని మరింత మెరుగైనదానిగా తయారు చేసుకోగలుగుతాడు. మనలోని, అంటే భారత సమాజంలోని తప్పుల్ని, చెడులక్షణాలను స్వామీజీ ఎత్తిచూపారు. వాటిని కొద్దిమాటలలో చర్చిద్దాం.

### బానిస మనస్తత్వం

“సోదరా! మనం అన్ని చెడు లక్షణాలను వదిలించుకోగలం కానీ, ఆ నికృష్టమైన అసూయను మాత్రం వదిలించుకోలేకుండా ఉన్నాం. అదే మన జాతి దౌర్భాగ్యం. ఇతరులను గురించి చెడుగా మాట్లాడడం, ఇతరుల గొప్పతనాన్ని చూసి ఓర్వలేక హృదయంలో దహించుకుపోవడం, గొప్పతనం అంతా నాదేననీ, ఇతరులెవ్వరూ

దాన్ని పొందకూడదనీ అనుకోవడం మన జాతి యొక్క చెడు లక్షణాలు.... ఒకరితో ఒకరు మర్యాదగా ఎలా ప్రవర్తించాలో మనకు తెలియదు. మనం పిరికిపందలం, చీటికీమాటికీ పోట్లాటలకు దిగుతాం. ఇవే మన లక్షణాలు" అని స్వామీజీ చెప్పారు. ఇవన్నీ బానిసత్వంలో ఎక్కువకాలం మగ్గడంవల్ల మన జాతికి సంక్రమించిన అవలక్షణాలు అని కూడా ఆయన చెప్పారు. "మనందరికీ మనమే ముఖ్యం. మనలో ప్రతివొక్కరికీ తనమాట నెగ్గడమే ముఖ్యం. దానివల్ల ఏ పనీ జరగదు" అని చెప్పారు. మనలోని ఈ చెడులక్షణం వల్ల వ్యక్తిగతంగా మనం ఎటువంటి అభివృద్ధీ సాధించలేకపోవడమే కాక, చుట్టూవున్న సమాజం కూడా పురోగమించలేదు.

మన చుట్టూవున్న సమాజంలో అందరూ బాగున్నప్పుడే మనం కూడా బాగా ఉండగలుగుతాం. ఇది తిరుగులేని సత్యం. మన తోటివారందరూ ఆరోగ్యంగా, క్షేమంగా ఉన్నప్పుడే మనకు కూడా ఆరోగ్యం, క్షేమం కలుగుతాయి.

## మన శరీరాలలో బలం లేదు!

"చిలుక పలికినట్లు మనం చాలా విషయాలు మాట్లాడతాం. కానీ వాటిని ఎప్పుడూ ఆచరణలో చూపించం. చెప్పింది చెయ్యకపోవడమనేది మనకొక అలవాటుగా తయారయి పోయింది. దానికి కారణం ఏమిటి? మన శరీరాలు బలహీనంగా

ఉండడమే!" అని స్వామీజీ చెప్పారు.

శరీరం బలహీనంగా ఉన్నప్పుడు ఆలోచనలు కూడా బలహీనపడతాయి. అటువంటి వారిని భయం, పిరికితనం వదిలిపెట్టిపోవు. భయపడుతూ పనిచేసేవాళ్ళు, పిరికిగుండెతో నిర్ణయాలు తీసుకునేవారు ఎటువంటి ఘనకార్యాలనైనా ఎలా సాధించగలుగుతారు? "ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీ" – "సింహంలాంటి గుండెధైర్యం, సాహసం కలవారినే లక్ష్మీదేవి (విజయం) వరిస్తుంద"ని స్వామీజీ నొక్కి చెప్పారు. అంతేకాక, "శారీరకంగా కానీ, మానసికంగా కానీ, ఆధ్యాత్మికంగా కానీ, మిమ్మల్ని బలహీనపరిచేది ఏదైనా సరే దానిని విషపదార్థంలాగా భావించి పారవెయ్యండి, దానిని మీ కాలిగోటితో కూడా తాకవద్దు" అని చెప్పారు.

మాటిమాటికీ రోగాలబారిన పడడం మంచి వ్యక్తిత్వ నిర్మాణానికి అవరోధంగా నిలుస్తుంది. అతిగా నిద్రపోవడం కూడా ఒక రోగమే. "రోగం అనేది ఎక్కువశాతం మన శారీరకమైన బలహీనతవల్లనే కలుగుతుంది. రోగాన్ని విదిల్చి పారవెయ్యండి. మీ గురించి మీరు బలవంతులుగా, ఏ రోగానికీ లొంగనివారుగా మనస్సులో ఊహించుకోండి. ప్రతిరోజూ మీలోని శక్తిని గురించి ఇలా ఒక గంటసేపు అనుకుంటే కొద్దిరోజుల్లోనే మీ రోగం ఎగిరిపోతుంది" అని స్వామీజీ చెప్పారు. కాబట్టి శారీరకంగాను,

మానసికంగాను గొప్పబలాన్ని పెంపొందించుకోవడం వ్యక్తిత్వనిర్మాణంలో అతిముఖ్యమైన భాగం.

## శారీరకశ్రమను మనం ఇష్టపడం

శారీరక శ్రమ మనకు నచ్చదు. సుఖంగా కూర్చోవడమే మనందరికీ ఇష్టం. అటువంటి ఉద్యోగాలే మన ఆదర్శం! ప్రతి చిన్న పనికీ మనం ఇంకొకరి మీద ఆధారపడతాం. సమాజం స్థాయిలో ప్రతి చిన్న పనికీ ప్రభుత్వం మీద ఆధారపడతాం. దీనికి ముఖ్యమైన కారణం సమాజానికి దారి చూపవలసిన వ్యక్తులు శారీరక శ్రమను ఇష్టపడకపోవడమే.

స్వామీజీ, "మీరు మీ శరీరాలను మహాబలమైనవిగా చేసుకోవాలి. ఇతరులకు కూడా అలా చేసుకోవడాన్ని నేర్పాలి. ఈనాటికీ నేను ఇనుపలోడీలతో (డంబెల్స్‌తో) వ్యాయామం చెయ్యడం మీరు చూడడం లేదా? ఉదయం, సాయంత్రం వ్యాయామం చెయ్యండి! నడవండి! శారీరకమైన శ్రమ చెయ్యండి! శరీరమూ, మనస్సూ చేదోడువాదోడుగా ముందుకు సాగాలి. ఆ రెండింటినీ బలమైనవిగా చెయ్యాలి. ప్రతి చిన్న పనికీ ఇతరుల మీద ఆధారపడకూడదు" అని బోధించారు.

మనం ఏ పని చేస్తున్నామన్నది ముఖ్యం కాదు. కానీ చేసే పనిని ఎంత చక్కగా చేస్తున్నామన్నది ముఖ్యం. మనం ఏ వృత్తి వ్యాపారాలను చేస్తున్నా ఫర్వాలేదు. చరిత్రలోని గొప్ప

వ్యక్తులందరూ తాము ఏ పని చేస్తున్నామన్న దానికన్నా ఎలా చేస్తున్నామన్నదాని మీదే దృష్టి పెట్టారు. "మీ జీవితంలో అపారమైన ఆదర్శాన్నీ, అపారమైన ఆచరణనూ మేళవించి చూపాలి. మీరు ఇప్పుడు తీవ్రమైన ధ్యానంలో నిమగ్నమవ్వాలి. మరుక్షణం పోయి ఆ భూమిని దున్నడానికి నడుం బిగించాలి. ఈ క్షణంలో మీరు శాస్త్రాలలోని ధర్మసూక్ష్మాల చిక్కుముడులను వివరించడానికి తయారుగా ఉండాలి. మరుక్షణంలో ఆ పొలంలో పండిన పంటను తీసుకుపోయి బజారులో అమ్మడానికి సిద్ధంగా ఉండాలి" అని స్వామీజీ బోధించారు.

## గ్రుడ్డి అనుకరణ

భారతదేశం ఇంచుమించు వెయ్యి సంవత్సరాలకు పైబడి బానిసతనంలో మగ్గిపోయింది. బానిసతనంలో ఉన్న జాతి యొక్క ముఖ్యలక్షణం ఏమిటంటే తమ అభిప్రాయాలూ, అలవాట్లూ తప్పనీ, తమను పరిపాలించేవారు చేసేదంతా గొప్పదనీ అనుకోవడం. అంతేకాక, వారిని గ్రుడ్డిగా అనుకరించడమే తమను కూడా గొప్పవారిగా చేస్తుందని భ్రమపడడం. కానీ ఇతర దేశాలకు చెందిన వ్యక్తులను అనుకరించడంకంటే మన దేశానికి చెందిన గొప్పవారిని అనుకరించడమే మనకు శ్రేయస్కరమనీ, గ్రుడ్డి అనుకరణ పనికిరాదనీ స్వామీజీ తేల్చి చెప్పారు.

"ఓ భారతదేశమా! నీవు అత్యున్నతమైన నాగరికతను,

గొప్పతనాన్ని సాధించాలని అనుకుంటున్నావు. అయితే ఇలా పరాయి భావాలను చిలుకపలుకుల్లా వల్లెవేయడం ద్వారా, ఇతరులను ఇలా గుడ్డిగా అనుకరించడం ద్వారా, ఇలా ఇతరుల మీద ఆధారపడడం ద్వారా వాటిని అందుకోగలుగుతావా? ఈ బానిసతనపు బలహీనతలతో, ఈ అసహ్యాన్ని కలిగించే దుర్మార్గపు ఆలోచనలతో, తోటివారిని అణచివేసే ఈ క్రూరత్వంతో ఏమి సాధించగలవు? ధీరులు, సాహసోపేతులు మాత్రమే పొందదగిన అటువంటి స్వేచ్ఛను ఇటువంటి సిగ్గుపడవలసిన పిరికితనం సహాయంతో పొందగలవా?" అని ఆయన ప్రశ్నించారు.

ఇలా స్వామీజీ ఎత్తిచూపిన అవలక్షణాలను వదిలించుకుంటే తప్ప మనం నిజంగా మన వ్యక్తిత్వాలను నిర్మించుకోలేము.

అయితే పాశ్చాత్యులలోని మంచిని అనుకరించమని కూడా స్వామీజీ చెప్పారు. మన సంస్కృతి మనకు అందించిన నిస్వార్థం, త్యాగం, నిజాయితీ మొదలైన విలువల్ని విడిచిపెట్టకుండా, పాశ్చాత్యులలోని పనితనాన్నీ, పట్టుదలనూ, విధేయతనూ, కలసికట్టుగా పనిచేయడాన్నీ నేర్చుకోమని స్వామీజీ బోధించారు.

## 04. గొప్ప వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవడం సాధ్యమేనా?

వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవడం సాధ్యమే. మన వ్యక్తిత్వాలను మనమే నిర్మించుకోవాలి కూడా. ఇంకొకరు మన వ్యక్తిత్వాన్ని

నిర్మించి మనకు బహుమతిగా ఇవ్వలేరు.

ఇప్పటికే మనకొక వ్యక్తిత్వం ఉంది. దానివల్లనే జీవితంలో కనీసం ఇప్పుడు ఉన్న పరిస్థితికి మనం చేరుకోగలిగాం. మరింత గొప్పవారం కావాలంటే మన వ్యక్తిత్వాన్ని మరింత ఉన్నతంగా నిర్మించుకోవాలి. ఈ పనిని మనకు మనమే చేసుకోవాలి.

దీనికి ఒక పద్ధతి ఉంది. మన వ్యక్తిత్వంలోని లోటుపాట్లవల్ల పొరపాట్లు చేస్తాము. మన వ్యక్తిత్వం మెరుగుపడే కొద్దీ మనం చేసే పొరపాట్లు తగ్గుతాయి. మనం చేసిన పొరపాట్లను తెలుసుకుని, మనలోని లోటుపాట్లను విశ్లేషించి ఆయా పొరపాట్లు మళ్ళీ జరగ కుండా చూసుకోవాలి. ఇందుకోసం నిజాయితీ కావాలి. చేసిన తప్పులు మళ్ళీ చేయకుండా ఉండాలని దృఢంగా నిశ్చయించు కోవాలి. వ్యక్తిత్వనిర్మాణంలో మనం ముఖ్యంగా చేసేది ఇదే.

స్వామీజీ, "నా జీవితంలో నేను చేసిన పొరపాట్లను దీవిస్తున్నాను. ఎందుకంటే అవే నన్ను మరింత మెరుగైన మనిషిగా తీర్చిదిద్దాయి" అని చెప్పారు.

## 05. వ్యక్తిత్వ నిర్మాణానికి ఆదర్శం అవసరమా?

ఆదర్శం గురించి వివేకానంద స్వామి ఈ విధంగా చెప్పారు: "మీరు దేనిని గురించి (ఏది) ఆలోచిస్తే అదే విధంగా తయారవుతారు. బలహీనతను గురించి ఆలోచిస్తే బలహీనులుగా

తయారవుతారు. బలాన్ని గురించి ఆలోచిస్తే బలవంతులుగా తయారవుతారు." కానీ బలాన్ని గురించి ఆలోచించాలంటే అందుకు తగిన విధంగా నిరంతరం మనకు బలాన్ని గుర్తు చేస్తూ, ఆ బలానికే చిహ్నమైన ఒక ఆదర్శం మనకు అవసరం.

స్వామీజీ ఇంకా ఇలా చెప్పారు. "ఒక ఆదర్శాన్ని ఎదురుగా ఉంచుకుని దానిని అనుసరించేటప్పుడు మనం తప్పు చేసేందుకు అవకాశం తక్కువ. ఆ ఆదర్శం మనకు అందనంత ఎత్తులో, చేరుకోలేనంత దూరంలో ఉండవచ్చు గాక. కానీ దానిని తప్పక పొంది తీరాలని మనం అనుకోవాలి. నిజానికి మనం ఎంచుకునే ఆదర్శం తప్పనిసరిగా అత్యున్నతమైన ఆదర్శం అయివుండాలి. అటువంటి ఆదర్శాన్ని మాత్రమే వ్యక్తులు, సమాజం తమ ముందు ఉంచుకోవాలి. దురదృష్టవశాత్తూ అధికశాతం మంది మనుష్యులు తమతమ జీవితాలలో అసలు ఎటువంటి ఆదర్శాన్ని ఏర్పరుచుకోకుండానే చీకటిలో తడుముకుంటూ జీవితమంతా గడుపుతుంటారు. జీవితంలో ఏదో ఒక ఆదర్శాన్ని తన ముందు ఉంచుకుని దానిని సాధించాలని ఆరాటపడే వ్యక్తి, తపనపడే వ్యక్తి, వెయ్యి తప్పులు చేస్తే, అసలు ఆదర్శమే లేకుండా జీవితాన్ని గడిపే వ్యక్తి యాభైవేల తప్పులు చేస్తాడు అని నేను రూఢిగా చెప్పగలను. కాబట్టి ఏదో ఒక ఆదర్శాన్ని కలిగి ఉండడమే మేలు."

కాబట్టి వ్యక్తిత్వ నిర్మాణానికి ఒక ఆదర్శం తప్పనిసరి.

# 06. ఆదర్శం అంటే ఏమిటి?

మనం ప్రస్తుతం ఉన్న పరిస్థితిలో సంతృప్తి చెందలేక ఒక పరిపూర్ణమైన స్థితిని పొందాలని కోరుకుంటాం. ఆ స్థితికి చేరుకున్నాక మనం పొరపాట్లు చెయ్యం, దుఃఖం అనేది ఉండదు, అంతులేని ఆనందం కలుగుతుంది. ఆ ఎత్తుకు చేరుకున్న తర్వాత మనం సాధించవలసినదేమీ మిగలదు. అటువంటి పరిపూర్ణమైన స్థితే మనకు ఆదర్శం అవుతుంది.

ఈ ఆదర్శాన్ని గురించిన భావన మనకే కలుగనవసరం లేదు. ఎవరైనా చెప్పినదైనా, ఎక్కడైనా విన్నదైనా కావచ్చు.

కాబట్టి ఒక మనిషి తన ఆలోచనలలో ఏర్పరచుకోగలిగే అత్యున్నతమైన భావననే అతడి ఆదర్శంగా మనం చెప్పుకోవచ్చు. అయితే ఇది మనిషికీ మనిషికీ వారివారి ఇష్టాయిష్టాలనుబట్టి మారిపోతూ ఉంటుంది.

సహజంగానే మనిషి అటువంటి స్థితిని పొందాలని కోరుకుంటాడు. కానీ ఎక్కువశాతం మందికి దానిని ఎలా పొందాలో తెలియదు. దానిని సాధించే మార్గం ఏమిటో, దానిని ఎలా పొందవచ్చునో, తద్వారా మన జీవితాలను గొప్పగా ఎలా తీర్చిదిద్దుకోవచ్చునో వివేకానంద స్వామి చక్కగా వివరించారు.

# 07. ఆ ఆదర్శాన్ని ఆచరణలో పెట్టేదెలా?

ఆ ఆదర్శాన్ని మన రోజువారీ జీవితాలలోకి తెచ్చేదెలా? ఆచరణలో పెట్టేదెలా? దాని ఆధారంగా మన వ్యక్తిత్వాలను నిర్మించుకునేదెలా? ఈ ప్రశ్నలకు వివేకానంద స్వామి ఇలా సమాధానం చెప్పారు.

“..మనం ఎంచుకునే ఆదర్శం అత్యున్నతమైనదై ఉండాలి. ఈ ఆదర్శాన్ని గురించి మనం ఎంత ఎక్కువగా వీలయితే అంత ఎక్కువ వినాలి. అది మన హృదయాలలోకి, మెదళ్ళలోకి, నరనరాలలోకి చొచ్చుకుని పోయేంతగా దానిని గురించి వినాలి. చివరకు అది మన ప్రతి రక్తపుబొట్టులోనూ తొణికిసలాడి, మన శరీరంలోని ప్రతి సూక్ష్మరంధ్రంలోకి చొచ్చుకుని పోయేంత వరకూ దానిని గురించి వినాలి. దానిని గురించి తీవ్రంగా ఆలోచించాలి. ‘గుండెలలో నిండి ఉన్న ఆలోచననే మాటల రూపంలో నోరు పలుకుతుంది’ అని చెపుతారు కదా! అదే విధంగా గుండె నిండుగా ఉన్న ఆలోచనలనే మనం చేతలలో కూడా చూపిస్తాము.”

ఆ విధంగా ఒక గొప్ప ఆదర్శం మన నరనరాలలోనూ నిండినప్పుడు మనకు అదే రకమైన వ్యక్తిత్వం అలవడుతుంది. మనం చేసే పనులన్నీ అదే గొప్పతనాన్ని సంతరించుకుంటాయి.

# 08. ఆ ఆదర్శానికి ఒక రూపం అవసరమా?

పూర్వం 'డాస్' (డిస్క్ ఆపరేటింగ్ సిస్టమ్)తో పనిచేసే కంప్యూటర్లు ఉండేవి. కంప్యూటర్ మానిటర్ మీద కేవలం అక్షరాలు, అంకెలు మాత్రమే కనిపించేవి. వాటితో పనిచెయ్యడం కొంత కష్టంగానే తోచేది. అందరికీ సాధ్యం అయ్యేది కాదు కూడా. అయితే ఆ తర్వాత గ్రాఫిక్ యూజర్ ఇంటర్‌ఫేస్‌తో పనిచేసే కంప్యూటర్లు వచ్చాయి. వీటిలో కంప్యూటర్ చేసే పనులన్నింటినీ సూచించే చిన్నచిన్న బొమ్మలు, అంటే ఐకాన్స్, మానిటర్ మీద ఎదురుగా ఉంటాయి. వీటితో పనిచెయ్యడం సులభం. అందుచేతనే ఈనాటి కంప్యూటర్లు బహుళ ప్రచారాన్ని పొందాయి. అదే విధంగా బొమ్మల ఆధారంగా మనకేదైనా విషయాన్ని వివరించినప్పుడు దాన్ని అర్థం చేసుకోవడం సులభం అవుతుందన్నది మనందరికీ అనుభవమైన విషయమే. భగవద్గీతలో కూడా ఇదే విషయం చెప్పబడింది.

**క్లేశోఽధిక తరస్తేషాం అవ్యక్తాసక్త చేతసాం।**
**అవ్యక్తా హి గతిర్ దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ (అ.12, శ్లో.5)**

రూపంలేని విషయాన్ని గురించి ఆలోచించడం కష్టమనీ, రూపం ఉన్న విషయాన్ని గురించి ఆలోచించడం, దానిని అర్థం చేసుకోవడం సులభం అనీ, అలా చెయ్యడంలో తక్కువ కష్టాన్ని ఎదుర్కోవలసి వస్తుందనీ భగవద్గీతలోని ఈ శ్లోకం సారాంశం.

అదే విధంగా మన ఆదర్శం ఎలా ఉండాలో వివేకానంద స్వామి విస్తారంగా వివరించారు. కానీ, అలా కేవలం భావాల రూపంలోనే చెపితే సరిపోదని ఆయనకు తెలుసు. ఆ భావాల సహాయంతోనే మనిషి తన వ్యక్తిత్వాన్ని నిర్మించుకోలేడనీ, మనుష్యులందరూ ఆ స్థితికి ఎదగలేరనీ, అందరికీ అంతటి మానసిక పరిణతి ఉండదనీ ఆయనకు తెలుసు. అందుచేతనే మన సంస్కృతి అందించిన మహాపురుషుల వ్యక్తిత్వాలను మన ఆదర్శాలుగా చేసుకోవాలని ఆయన ఉద్బోధించారు.

అయితే ఒక గొప్ప ఆదర్శాన్ని ఎన్నుకోగానే పొరపాట్లు చెయ్యడం దానంతట అదే ఆగిపోదు. కానీ మనం పొరపాటు చెయ్యబోతున్న సమయంలో ఆ ఆదర్శం మనకు గుర్తుకు వచ్చి ఆ పొరపాటు జరగకుండా ఆపుతుంది. "ఒక ఆదర్శాన్ని కలిగి ఉన్నవాడు వెయ్యి తప్పులు చేస్తే ఏ ఆదర్శం లేనివాడు యాభైవేల తప్పులు చేస్తాడని" స్వామీజీ ఘంటాపథంగా చెప్పారు కదా.

## 09. ఎటువంటి వ్యక్తిని మనం ఆదర్శంగా చేసుకోవాలి?

భారతదేశంలో అధికశాతం మనుష్యులు సత్వగుణాన్ని కలిగివున్నామని చెప్పుకుంటూ, దాని ముసుగులో పూర్తిగా తమస్సు అనే మత్తులో మునిగి ఉన్నారని వివేకానంద స్వామి చెప్పారు. ముందు ఈ తమస్సులో నుంచి బయటపడి

రజోగుణాన్ని అలవరచుకోవాలనీ, ఆ తరువాతే సత్వగుణం అలవడుతుందనీ వివేకానంద స్వామి మాటిమాటికీ చెప్పేవారు.

"....అప్పుడు మాత్రమే ప్రజలు గొప్పశక్తితో, గొప్ప సంకల్పబలంతో పనిచేసి బలవంతులుగా ఎదుగుతారు. రజోగుణాన్ని పుష్కలంగా పెంపొందించుకోనిదే, ఈ ప్రపంచంలో గానీ, పై ప్రపంచంలోగానీ, మీరు దేన్నైనా సాధించగలరన్న ఆశలు లేవు. దేశం అంతా తమస్సులో నిండుగా మునిగి ఉంది. సహజంగానే దానికి ఫలితంగా ఈ జన్మలో బానిసలుగా, దాసులుగా పడివుండక తప్పదు. మరుజన్మలో నరకమూ తప్పదు."

"తల నుండి పాదాల వరకూ నరనరాలలో రజస్సు పులకరిస్తూ పారుతున్న వ్యక్తి యొక్క ఆదర్శమే ఇప్పుడు మన భారతజాతికి కావాలి. ఏ ధీరుడు సత్యాన్ని తెలుసుకోవడం కోసం సాహసించగలడో, తన ప్రాణాలను అర్పించడానికి సిద్ధపడతాడో అటువంటి వ్యక్తి మనకు ఆదర్శం కావాలి. **ఏ ధీరుడు త్యాగాన్నే తన కవచంగా చేసుకుని, జ్ఞానాన్ని ఖడ్గంగా చేసుకుంటాడో అటువంటి ధీరుడే మనకు ఆదర్శం కావాలి.** జీవితమనే యుద్ధరంగంలో ధైర్యంగా పోరాడే సైనికుడి యొక్క శక్తి, స్ఫూర్తి మనకిప్పుడు కావాలి. అంతేకానీ, జీవితాన్ని సుఖాలతో నిండిన నందనవనంగా భావిస్తూ పగటికలలు కనే ప్రేమికుడు మనకు

ఎంతమాత్రమూ ఆదర్శంగా పనికిరాడు.” అని స్వామీజీ స్పష్టంగా మనకు చెప్పారు.

త్యాగాన్ని కవచంగా, జ్ఞానాన్ని ఖడ్గంగా చేసుకోవడం అంటే ఏమిటి? ముందు కవచం గురించి తెలుసుకుందాం. కవచం మనకు రక్షణనిస్తుంది. అసలు మనం 'రక్షణ కావాలి' అని ఎందుకు అనుకుంటాం? మన దగ్గర ఉన్నదేదో కోల్పోతామన్న భయం మనకు కలిగినప్పుడు మాత్రమే. కానీ, ఇతరుల కోసం నిస్వార్థంగా పనిచెయ్యాలనే త్యాగబుద్ధిగలవారికి దాచిపెట్టుకొనే దేమీ ఉండదు. ఆ త్యాగమే వారికి గొప్ప రక్షణ కవచంలాగా పని చేస్తుంది. దీనికన్న మెరుగైన రక్షణ ఎక్కడ దొరుకుతుంది?

## త్రిగుణాలు - వాటి లక్షణాలు

సత్త్వగుణం: పవిత్రత ఈ గుణం యొక్క లక్షణం. దీనివలన గొప్ప ప్రశాంతత, పని చెయ్యడంలో గొప్ప నేర్పరితనం కలుగుతాయి. ఈ గుణం కలవారు పనిలో పొరపాటున కూడా తప్పులు చేయరు, ఇతరులకు హాని కలిగించరు.

రజోగుణం లేదా రజస్సు: అమితమైన కోరిక ఈ గుణం యొక్క లక్షణం. దీనివలన చురుకుగా పనిచేస్తారు. అయితే ఈ గుణం మనలో అశాంతిని కలిగిస్తుంది. పనిచెయ్యడంలో జరిగిపోయే మంచి చెడులవల్ల కలిగే కష్టసుఖాలను ఎదుర్కోవలసి వస్తుంది.

తమోగుణం లేదా తమస్సు: అజ్ఞానం ఈ గుణం యొక్క లక్షణం. పని చెయ్యడంలో ఆలస్యం, బద్ధకం, నిర్లక్ష్యం, ఏమరుపాటుతనం ఈ గుణం వలన కలుగుతాయి.

దీనితోపాటు ఖడ్గం మనల్ని యుద్ధంలో ముందుకు తీసుకుపోతుంది. శత్రువుల్ని సంహరించి, తనవారిని రక్షించుకునేందుకు సహాయపడుతుంది. జీవితంలో తనదేదో, పరాయిదేదో – అంటే మంచి ఏదో, చెడు ఏదో – తెలియజెప్పే జ్ఞానాన్ని మన ఖడ్గంగా చేసుకున్నప్పుడు చెడుని అడ్డు తొలగించుకుని మంచి మార్గంలో ముందుకు పోగలుగుతాము.

ఇలా ఆ ఆదర్శమైన వ్యక్తి ఎలా ఉండాలో చెప్పిన తర్వాత అటువంటి వాళ్ళు ఎవరో కూడా ఆయన స్పష్టంగా సూచించారు.

## 10. అటువంటి ఆదర్శమూర్తులు ఎవరు?

మన పూర్వీకులు ఎంతో గౌరవించిన విలువలను తమ తమ జీవితాలలో ఆచరించి చూపిన మహోన్నత వ్యక్తిత్వాలను అనుకరించడమే మనకు నిజమైన గొప్పతనాన్నీ, నిజమైన వ్యక్తిత్వాన్నీ ఇస్తుంది. స్వామీజీ ఇలా చెప్పారు:

"ఈ దేశాన్ని లేవనెత్తాలి. మహావీరుడి ఆరాధనను ప్రవేశపెట్టాలి. (హనుమంతుడికి మరో పేరు మహావీరుడు). మన రోజువారీ సాధనలలో శక్తిపూజ (అంటే జగన్మాతను పూజించడం) ఒక తప్పనిసరి అంశం కావాలి. ప్రతి ఇంటిలోనూ శ్రీరామచంద్రుణ్ణి తప్పక ఆరాధించాలి. అందులోనే మీ సంక్షేమం ఉంది. దాని వల్లనే మీ దేశానికి మేలు కలుగుతుంది. మరొక

మార్గం లేనేలేదు... ముందుగా మహర్షుల ఆరాధనను ప్రజలకు పరిచయం చెయ్యాలి. ఎల్లకాలం నిలచి వుండే సత్యాలను సాక్షాత్కరించుకున్న ఆ మహాత్ములను జాతి ముంగిట ఆదర్శంగా చూపాలి. భారతదేశం విషయంలో శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, హనుమంతుడు, శ్రీరామకృష్ణుడు అటువంటి ఆదర్శమూర్తులు కాగలరు. శ్రీరాముణ్ణి, హనుమంతుణ్ణి ఆరాధించడాన్ని ఈ దేశంలో ప్రజలకు నేర్పించాలి. ప్రస్తుతానికి బృందావనంలో విహరించే శ్రీకృష్ణుడి వ్యక్తిత్వాన్ని ప్రక్కన పెట్టండి! దానికి బదులు కురుక్షేత్రంలో భగవద్గీతా సందేశంతో సింహంలా గర్జిస్తూ అర్జునుని యొక్క పిరికితనాన్ని వదలగొట్టిన శ్రీకృష్ణుణ్ణి ఆరాధించడాన్ని ప్రజలకు నేర్పాలి. అన్ని శక్తులకూ మూలమైన జగన్మాత యొక్క ఆరాధనను, శక్తి పూజను తిరిగి రోజువారీ జీవితంలోనికి తేవాలి."

ఇలా ఎటువంటి వారిని మన ఆదర్శంగా చేసుకోవాలో స్వామీజీ స్పష్టంగా చెప్పారు.

# 11. మన సంస్కృతిలోనుంచే వేరే ఆదర్శాలను తీసుకోవచ్చునా?

ఒక శిష్యుడు స్వామీజీని, "స్వామీ! మరి బృందావనంలో గోపికలతో విహరిస్తూ దివ్యలీలలను ప్రదర్శించిన కృష్ణుణ్ణి

ఆదర్శంగా తీసుకోవడం మంచిది కాదా? గోపికలు ఎన్నుకున్న ప్రేమమార్గం మంచిది కాదా?" అని ప్రశ్నించాడు.

స్వామీజీ, "అది మంచిది కాదని ఎవరంటారు? కానీ అది చాలా ఉన్నతమైన సాధన. ఈ కాలం మనుష్యులకి దాన్ని సాధన చేసే శక్తి లేదు. ఈ కాలంలో మనుష్యులు చాలా సులభంగా ఇంద్రియ సుఖాల మోజులో, సంపదల మోజులో పడిపోతారు. గోపికల ప్రేమమార్గంలాంటి ఉన్నతమైన ఆదర్శాలను గురించి ఆలోచించే శక్తి కూడా ఈ రోజులలో ఎవరికీ లేదు. కాబట్టి ప్రస్తుత పరిస్థితులలో ఆ రకమైన ఆరాధన మీకు ఏ విధంగానూ మంచిది కాదు. పిల్లనగ్రోవిని ఊదుతూ, గోపికలతో విహరించే కృష్ణుణ్ణి ఆదర్శంగా తీసుకుంటే భారతదేశ పునర్నిర్మాణానికి అది ఉపయోగపడదు. ఏ వ్యక్తిలో నరనరాలనూ పులకరింప చేస్తూ రజస్సు పారుతూ ఉంటుందో అటువంటి వ్యక్తి యొక్క ఆదర్శమే ఇప్పుడు భారతజాతికి కావాలి. ఈ రజస్సు అనే గుణం మనిషిని మన్నుతిన్న పాములాగా నిద్రపోతూ పడివుండకుండా, ఉత్సాహంతో ఉరకలు వేసేలా చేసి, దేనినో సాధించాలి అనే తపనను పుట్టించి అతడిలో చురుకుతనాన్ని కలిగిస్తుంది," అని జవాబిచ్చారు.

అయితే అటువంటి రజోగుణంతో నిండిన వ్యక్తులు మనకు ఎక్కడ కనిపిస్తారు?

"గత కొన్నివేల సంవత్సరాలుగా హిందూప్రపంచం మొత్తం తమ గుండెలలో దాచుకున్న సాంస్కృతిక వారసత్వమే రామాయణ, మహాభారతాలు. అవి ఈ హిందూదేశ ప్రజల ఆలోచనలకూ, నైతిక ధార్మిక భావాలకూ పునాదిగా రూపుదిద్దుకున్నాయి. నిజానికి రామాయణ, మహాభారతాలు ఆర్యుల సనాతన జీవనాన్ని, విజ్ఞానాన్ని పదిలపరచుకున్న రెండు విజ్ఞాన సర్వస్వాలు. ఒక ఆదర్శవంతమైన నాగరికత వాటిలో ప్రదర్శించబడింది. మానవాళి ఈనాటికీ అంతగొప్ప ఆదర్శాన్ని కోరుకోగల స్థాయికి చేరుకోలేదు." అని స్వామీజీ రామాయణ, మహాభారతాలను కీర్తించారు. ఈ పురాణాలలో అటువంటి ఆదర్శమూర్తులు మనకు కనిపిస్తారు. వాటిలోని కథలను, నీతిని మన విద్యార్థులు, యువత నేర్చుకోవాలని, వాటిలోని వ్యక్తిత్వాలకు అనుగుణంగా తమ జీవితాలను మలచుకోవాలని స్వామీజీ బోధించారు. ముఖ్యంగా మహావీరుడైన హనుమంతుణ్ణి ఆయన వేనోళ్ళ కొనియాడారు.

## 12. హనుమంతుణ్ణే ఆదర్శంగా ఎందుకు తీసుకోవాలి?

ఒక శిష్యుడు స్వామీజీని, "మనం ఎటువంటి ఆదర్శాన్ని అనుసరించాలి, స్వామీ?" అని ప్రశ్నించాడు.

స్వామీజీ, “**మీరు ఇప్పుడు హనుమంతుణ్ణి ఆదర్శంగా చేసుకోవాలి.** శ్రీరామచంద్రుడి ఆజ్ఞను పాలించడం కోసం అతడు సముద్రాన్ని ఎలా దాటాడో చూడండి. తాను జీవిస్తానో, మరణిస్తానో అన్న భయం అతడికి ఏ మాత్రమూ లేదు. అతడు ఇంద్రియాలను పూర్తిగా తన అదుపులో ఉంచుకున్నాడు. గొప్ప సూక్ష్మబుద్ధి గలవాడు. (అంటే పదునైన తెలివితేటలు గలవాడు.) ‘ప్రభువుని సేవించడం’ అనే గొప్ప ఆదర్శాన్ని ఆ మహావ్యక్తి తన జీవితంలో ఆచరించి చూపాడు. ఆ ఆదర్శం ఆధారంగా ఇప్పుడు మీరు మీ జీవితాలను మలచుకోవాలి. ఆ ఆదర్శాన్ని మీరు చక్కగా జీవించి చూపితే దాని ద్వారా జీవితంలో కోరుకోదగిన ఇతర ఆదర్శాలన్నీ కూడా వాటంతట అవే క్రమక్రమంగా వికసిస్తాయి. కఠోరమైన బ్రహ్మచర్యాన్ని పాటించాలి. గురువుపట్ల ఎదురుచెప్పని విధేయతను చూపాలి. విజయరహస్యం వీటిలోనే ఉంది. హనుమంతుడు ఒకవైపు దాసులలో అత్యుత్తముడు అన్న ఆదర్శాన్ని చూపిస్తూనే మరొక ప్రక్క సింహానికి ఉండే ధైర్యాన్ని, సాహసాన్ని చూపి ప్రపంచం మొత్తాన్ని నోరువెళ్ళపెట్టేలా చేశాడు. రాముడి మంచి కోసం తన జీవితాన్ని త్యాగం చెయ్యడానికి అతడు ఏ మాత్రమూ సంకోచించలేదు. రాముడికి సేవ చెయ్యడాన్ని తప్ప ఇంక దేనినీ అతడు పట్టించుకోలేదు. చివరికి లోకాలకే ప్రభువులయిన బ్రహ్మ, శివుడు మొదలైన దేవతల స్థితిని

పొందాలని కూడా అతడు కోరలేదు. శ్రీరాముడికి బంటుగా అతడికి మేలు కలగాలనే ఉద్దేశ్యంతో అత్యుత్తమంగా పని చేయడమే అతడు తన జీవితంలో చేపట్టిన ఒకేవొక వ్రతం. అటువంటి హృదయపూర్వకమైన భక్తినే ఈనాడు మన ఆదర్శంగా చేసుకోవాలి" అని ఆ శిష్యుడికి చెప్పారు.

# 13. మనం అలవరచుకోవలసిన మరికొన్ని సుగుణాలు ఏవి?

సుదీర్ఘకాలం అనుభవించిన బానిసత్వంతో పాటు మన ఆహారపు అలవాట్లు, మనం ఆలోచించే పద్ధతి, మనకు వినోదాన్ని ఇచ్చే సంగీతం, సాహిత్యం, కళలు అన్నీ అవలక్షణాలతో నిండిపోయాయి. మంచి వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవాలంటే మనం వీటి మీద కూడా దృష్టి పెట్టాలి.

మనం తినే ఆహారం మనకు బలాన్నిచ్చేదిగా ఉండాలి. మనం వినే సంగీతం, మనం చదివే పుస్తకాలు, మనం నేర్చుకునే కళలు మనలో బలమైన ఆలోచనలను తయారు చేయగలగాలి. మన మనస్సు మీద, మన ఇష్టాయిష్టాల మీద పట్టుసాధించేందుకు, శారీరకంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా మరింత ఉన్నతిని సాధించేందుకు అవి మనకు తోడ్పడాలి. శరీరం ద్వారా కలిగే క్షణికమైన సుఖాలమీదకి ఆలోచనలను మరలించి తద్వారా

మనల్ని బలహీనులుగాను, బానిసలుగాను చేసే సంగీతం, సాహిత్యం, కళలు, సినిమాలు పనికిరావు. హనుమంతుణ్ణి పొగడడంతోపాటు, అదే శిష్యుడితో మాట్లాడుతూ, ఇంతకు ముందు చెప్పిన రజోగుణాన్ని అలవరచుకోవడానికి కావలసిన మరికొన్ని విషయాలను స్వామీజీ వివరించారు.

"మీ దేశంలో మృదంగాలనూ, దుందుభులనూ తయారు చెయ్యరా? మీ దేశంలో బాకాలూ, భేరీలు దొరకవా? మీ పిల్లలకు ఈ వాయిద్యాల యొక్క గంభీరమైన నాదాలను వినిపించండి! చివరికి ఈ కాలంలోని కవులు కూడా ఈ ఉన్నతమైన (హనుమంతుడి వంటి) ఆదర్శాన్ని తమ కవిత్వంలో చిత్రీకరించ లేకపోతున్నారు. డమరుకాలను మోగించాలి! బాకాలనూ, తూరవాద్యాలనూ (కాహళులనూ) పూరించి ఊదాలి. భేరీలను వాయించాలి. గంభీరమైన యుద్ధస్వరాలు మారుమ్రోగాలి. 'మహావీర్! మహావీర్!' అనీ, 'హర! హర! వ్యోం! వ్యోం!' అనీ, దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చెయ్యాలి. ప్రస్తుతం కొంతకాలం పాటు మనిషిలోని మృదుభావాలను మాత్రమే మేలుకొలిపే సంగీతాన్ని ఆపండి. ఖయాల్, తప్పా లాంటి లలితసంగీతాన్ని కొంతకాలంపాటు ఆపి ధ్రుపద్ సంగీతాన్ని ప్రజలకు అలవాటు చెయ్యండి. గంభీరమైన వేదమంత్రాల ఘోషతో దేశానికి మళ్ళీ జీవం పొయ్యాలి. ప్రతి విషయంలోనూ తపశ్శక్తితో కూడిన

ధీరత్వాన్ని, పౌరుషత్వాన్ని పునరుజ్జీవింప చెయ్యాలి. అటువంటి (హనుమంతుడు వంటి) ఆదర్శాన్ని అనుసరించడం ద్వారానే ప్రజలకు, దేశానికి మేలు కలుగుతుంది. తినడంలోనూ, దుస్తులు ధరించడంలోనూ, నిద్రపోవడంలోనూ, ఆటపాటలలోనూ, ఆనందంలోనూ, చివరికి అనారోగ్యంలో కూడా - ఎల్లప్పుడూ అత్యున్నతమైన నీతిగల జీవితాన్ని గడపండి. దాని ద్వారా కలిగే ధైర్యాన్ని మీ జీవితంలో ప్రదర్శించి చూపండి. అప్పుడు మాత్రమే ఆ మహాశక్తి యొక్క కృపను మీరు పొందుతారు."

# 14. హనుమంతుడి గుణధ్యానం - ఏమిటి, ఎలా?

మనకు నచ్చిన వ్యక్తి లేదా దేవుడి యొక్క గుణగణాలను గురించి, వారు చేసిన పనులను గురించి, వారు సాధించిన విజయాలను గురించి మాటిమాటికీ గుర్తుచేసుకుంటూ వాటి గురించే ఆలోచించడాన్నే గుణధ్యానం అని చెప్పుకోవచ్చు.

ప్రతిరోజూ మనందరం తెలిసిగానీ, తెలియక గానీ ఈ గుణధ్యానాన్ని చేస్తూనే ఉంటాం. మనకు నచ్చిన క్రీడాకారుణ్ణి గానీ, నటుణ్ణి గానీ మాటిమాటికీ తలుచుకుంటూ ఉంటాం. అతడు ఎంత బాగా ఆడతాడో అని గానీ, ఎంత బాగా నటిస్తాడో అని గానీ తరచూ మన మనస్సులో అనుకుంటూ ఉంటాం. దానికి తోడు

స్నేహితులతో వారిని గురించి గంటల కొద్దీ వర్ణించి చెపుతాము. అతడు చేసే ప్రతి చిన్న పనినీ మనం ఆకాశానికి ఎత్తేస్తాం. అతడు మాట్లాడిందే మనకి వేదం. చివరకు అతడు ఏమైనా తప్పులు, పొరపాట్లు చేస్తే వాటిని మనం సమర్థించడానికి వెనకాడం. ఇదంతా గుణధ్యానమే.

ఇక వారి వ్యక్తిత్వాలు మనపై ప్రభావాన్ని చూపడాన్ని మనమే ప్రత్యక్షంగా గమనించవచ్చు. చివరకు మన నడక, మాట, వేషం, భాష, హెయిర్‌స్టైల్ కూడా అతడిలాగా మారిపోతాయి. చాలాసార్లు మనకు తెలియకుండానే ఇలా జరిగిపోతుంది కూడా. నిజానికి మనం ప్రస్తుతం మాట్లాడుతున్న వ్యక్తిత్వాలు అంత గొప్పవేమీ కావు. అందువల్లనే మన వ్యక్తిత్వాలు కూడా ఒక స్థాయిని మించి ఎదగవు. (పైగా ఆ క్రీడాకారుడో, నటుడో దుర్మార్గుడుగా తేలితే అప్పుడు మన వ్యక్తిత్వం గతి ఏమవుతుంది?) ఏది ఏమైనా ఈ క్రీడాకారులు, నటులు కూడా ఎంతో కొంత ఉత్సాహాన్ని, స్ఫూర్తిని మనలో నింపుతున్నారు. ఇంత చిన్న వ్యక్తిత్వాలు గల మనుష్యుల గురించి ఆలోచిస్తేనే మనకు ఈ మాత్రం ఫలితాలు లభిస్తే భారతజాతికే ఆదర్శపురుషుడుగా వివేకానంద స్వామిచే కీర్తించబడ్డ హనుమంతుడి గురించి ఆలోచించి ఆయన వ్యక్తిత్వం మీద గుణధ్యానం చేస్తే ఎంత గొప్ప ఫలితాలు వస్తాయో ఊహించండి!

## 15. వాల్మీకి హనుమంతుణ్ణి ఎలా వర్ణించాడు?

వాల్మీకి మహర్షి మానవజాతికి అందించిన ఆదికావ్యం రామాయణం. ఆ కథ మనందరికీ బాగా పరిచయమే. స్వామీజీ, "శీల-నిర్మాణాన్ని నేర్పడానికి రామాయణం ఒక గొప్ప సాధికారికత గల పురాణం!" అని చెప్పారు.

రామాయణంలో కావ్య నాయకుడు రాముడు. రాముడి తర్వాత అంత ఉన్నతస్థానాన్ని అందుకున్నవాడు హనుమంతుడే. రామాయణంలో మొదటి అధ్యాయాలయిన బాలకాండ, అయోధ్యకాండ, అరణ్యకాండలలో హనుమంతుడి ప్రస్తావన లేదు. హనుమంతుడు మొదటగా కిష్కింధకాండలో కనిపిస్తాడు. సుందరకాండలో తన విశ్వరూపాన్ని చూపిస్తాడు. ఆపైన యుద్ధకాండ ముగిసేవరకూ - అంటే రామ పట్టాభిషేకం పూర్తి అయ్యేవరకూ రామాయణం కథ హనుమంతుడి చుట్టూ తిరుగుతుంది.

**అంజనానందనం వీరం జానకీ శోకనాశకం ।**
**కపీశం అక్ష హంతారం వందే లంకాభయంకరమ్ ॥**

అని ఆదికవి వాల్మీకి హనుమంతుణ్ణి వర్ణించాడు. అంటే "అంజనాదేవి కుమారుడైన హనుమంతుడు సీతాదేవి శోకాన్ని నాశనం చేశాడు. అతడు వానరులకు నాయకుడు. అక్షకుమారుణ్ణి

సంహరించి, లంకను భయంలో ముంచెత్తాడు” అని వాల్మీకి హనుమంతుణ్ణి గొప్ప కర్మయోగిగా, కార్యసాధకుడిగా, మహావీరుడిగా మన ముందు ఉంచాడు.

కానీ... రామాయణంలో వాల్మీకి చూపిన హనుమంతుని వ్యక్తిత్వం యొక్క రూపానికీ, అనంతరకాలంలో రామభక్తులు వర్ణించిన హనుమంతునికీ, ఏనుగుకీ దోమకీ ఉన్నంత తేడా ఉంది. “చివరికి ఈ కాలంలోని కవులు కూడా (హనుమంతుడి వంటి) ఈ ఉన్నతమైన ఆదర్శాన్ని కనీసం తమ కవిత్వంలోనైనా చిత్రీకరించలేకపోతున్నారు.” అని వివేకానంద స్వామి చెప్పగా మనం చూశాము. గత వెయ్యేళ్ళ కాలంలో హనుమంతుడి వ్యక్తిత్వం వాల్మీకి వర్ణించినట్టుగా చిత్రీకరించబడలేదు. కేవలం రామనామం వింటే పరవశించిపోయే భక్తుడిగా మాత్రమే అతడు చిత్రీకరించబడ్డాడు. అయితే ఆ భక్తితో పాటు, స్వామీజీ చెప్పినట్టుగా, రజోగుణంతో ఉప్పొంగుతూ, సత్త్వగుణంతో భాసిల్లుతూ కనిపించే వాల్మీకి వర్ణించిన హనుమంతుణ్ణి మన ఆదర్శంగా చేసుకోవడం ఈ కాలంలో అత్యవసరం.

వాల్మీకి రామాయణంలో కొన్ని ముఖ్యమైన ఘట్టాలలో హనుమంతుడు ఎలా ప్రవర్తించాడో, ఇతరులతో ఎలా మాట్లాడాడో పరిశీలిద్దాం. తద్వారా అతడి వ్యక్తిత్వంలోని గొప్పతనాన్ని మనం తెలుసుకోగలుగుతాము. ఆయన ప్రవర్తించిన

తీరును అనుకరించడం ద్వారా ఆయన సుగుణాలు మనకు కూడా అలవడతాయి.

## 16. రామాయణంలో హనుమంతుడి పాత్ర ఏమిటి?

కిష్కింధకు నాయకులైన వాలి, సుగ్రీవుడు అన్నదమ్ములు. వారిద్దరి మధ్య అపోహలు ఏర్పడ్డాయి. వాలి సుగ్రీవుణ్ణి వెళ్ళగొట్టి రాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. సుగ్రీవుడు ఉత్తముడు. కానీ వాలిని జయించే పరాక్రమం అతడికి లేదు. అందుచేత దగ్గరలోనే ఉన్న ఋష్యమూక పర్వతం మీద నివసించసాగాడు. హనుమంతుడు సుగ్రీవుడి మంత్రులలో ఒకడు.

తండ్రి మాటను నిలబెట్టడానికి అడవులపాలైన శ్రీరాముడి భార్య సీతను రావణుడు అపహరించి లంకకు తీసుకుపోయాడు. మహా పరాక్రమవంతుడైన శ్రీరాముడు సీతను వెదుకుతుండగా ఎవరో సుగ్రీవుడి సహాయం తీసుకోమని అతడికి సలహా ఇచ్చారు. సుగ్రీవుడి కోసం శ్రీరాముడు కిష్కింధ ప్రాంతాలకు వచ్చాడు. రామాయణంలో హనుమంతుడు ఇక్కడే మొదటిసారి మనకు కనిపిస్తాడు. ఇక మనం రామాయణంలో హనుమంతుడు ఎలాంటి మహత్తరమైన పాత్రను పోషించాడో చూడడంతోపాటు ఆయా సందర్భాలలో అతడి ప్రవర్తనను వివేకానంద స్వామి బోధనల వెలుగులో పరిశీలిద్దాము.

# 17. నిజమైన గొప్పతనం ఎందులో ఉందో తెలుసుకోవాలి

సుగ్రీవుడి మంత్రిగానే హనుమంతుడు తన జీవితాన్ని గడిపాడు. వానరులందరిలోకీ తానే గొప్పవాడయినప్పటికీ ఎన్నడూ రాజు కావాలని కోరుకోలేదు. మంత్రిగా తాను చేసే వృత్తి తనకు సరిపడ గౌరవాన్ని ఇవ్వలేదని అనుకోలేదు. మంత్రిగా తన విధుల్ని అత్యున్నతంగా భావించి నెరవేర్చాడు. హనుమంతుణ్ణి చూసి మనం చక్కగా నేర్చుకోవలసిన అతి ముఖ్యమైన గుణం ఇది. స్వామీజీ, "ఎవరైతే తక్కువ స్థాయి పని చేస్తాడో వాడు తక్కువ రకం మనిషి కాడు. ఒక మనిషిని కేవలం అతడు చేసే పని యొక్క స్వభావాన్ని, స్థాయినిబట్టి అంచనా వెయ్యడానికి వీలులేదు. కానీ మనుష్యులు తమ పనుల్ని ఎలా, ఏ స్ఫూర్తితో చేస్తున్నారన్నదాన్ని బట్టి వారిని అంచనా వెయ్యాలి" అని చెప్పారు.

అలా అయితే వృత్తిలో అభివృద్ధి చెందాలనీ, పెద్ద బాధ్యతలను పొందడం ద్వారా మరింత ప్రఖ్యాతిని పొందాలని అనుకోవడం తప్పా? కాదు. కానీ అది ఎలా సాధ్యమో, అందుకోసం ఏమి చెయ్యాలో స్వామీజీ విడమరచి చెప్పారు. "ప్రతివాడూ ఒక మహారాజులాగా సింహాసనం మీద కూర్చోవడానికి తాను సమర్థుణ్ణని అనుకుంటాడు. అతడు సమర్థుడే కావచ్చు. అయినా, ప్రస్తుతం తానున్న స్థితిలో, తన బాధ్యతను చక్కగా నిర్వర్తించ

గలిగానని అతడు ముందు నిరూపించుకోవాలి. అప్పుడు మాత్రమే మరింత పెద్ద బాధ్యతలు అతడికి అప్పగించబడతాయి.” కాబట్టి ఈ క్షణంలో మనం చేస్తున్న పనిని ఎంత చక్కగా చేస్తున్నామన్నదే అత్యంత ముఖ్యమైన విషయం.

పైగా ప్రతి ఒక్కరూ తానే నాయకుణ్ణి కావాలనుకుంటే అది సాధ్యమవుతుందా? ఒకవేళ నాయకుడయినా ఆ స్థానాన్ని నిలుపుకోగలుగుతాడా? స్వామీజీ, “మనం ఈ ప్రపంచంలో చిత్తశుద్ధితో పనిచెయ్యడం మొదలు పెట్టినప్పుడు, ప్రకృతి రకరకాల సమస్యలను, కష్టాలను మన మార్గంలో అడ్డుగా ఉంచి, ఎడాపెడా లెంపలు వాయిస్తుంది. వాటిని దాటేందుకు తగిన శక్తియుక్తులు మనకున్నాయో లేదో పరీక్షిస్తుంది. త్వరలోనే మన స్థానం ఏమిటో మనకు తెలిసేలా చేస్తుంది. ఏ మనిషైనా, ఏ బాధ్యతను నిర్వర్తించడానికి తగిన సమర్థత తనకు లేదో, ఆ బాధ్యతను ఎక్కువకాలం సంతృప్తికరంగా నిలిపి ఉంచుకోలేడు. ప్రకృతి ఆ విధంగా చేసే న్యాయనిర్ణయానికి వ్యతిరేకంగా సణిగి ప్రయోజనం లేదు” అని చెప్పారు. కాబట్టి మనం చెయ్యాల్సిన విధిని చక్కగా నిర్వహించినప్పుడు, మన శక్తియుక్తులకు తగినట్టుగా, మరింత గొప్ప బాధ్యతలు వాటంతట అవే మనల్ని వెతుక్కుంటూ వస్తాయి. వ్యక్తిత్వ నిర్మాణంలో ఇది ముఖ్యమైన అంశం.

మరొక దృక్కోణంలో చరిత్రను గమనిస్తే నిజానికి రామాయణంలో సీతారాముల తర్వాత వారంత గొప్పస్థానాన్ని సంపాదించుకున్నది హనుమంతుడే! వేరెవరికీ అంతటి గొప్ప స్థానం దక్కలేదు! మంత్రిగా చిన్న బాధ్యతను నిర్వహించిన వాడే అయినప్పటికీ మన జాతికే ఆదర్శప్రాయుడిగా నిలిచాడు. వేల సంవత్సరాలుగా, కోట్లాది జనుల గౌరవాన్ని అందుకుంటున్నాడు.

## 18. ఉడుతలాగా ఉండాలి

రామాయణ కథను చెపుతూ స్వామీజీ, “లంకకు సేతువు కడుతున్నప్పుడు వానరులు పెద్దపెద్ద కొండలను ఊడబెరికి సముద్రంలో వేసి, వాటి మీద రాళ్ళను, చెట్లను పరిచారు. ఈ విధంగా పెద్ద ఆనకట్ట తయారయింది. ఒక కథ ప్రకారం, ఒక చిన్న ఉడుత శరీరాన్ని నీటిలో తడుపుకుని, ఇసుకలో పొర్లి, తన వంటికి ఇసుక అంటించుకుని, సేతువు మీదకు ఎక్కి అక్కడ ఆ ఇసుకను విదల్చసాగింది. అలా నేలమీద నుంచి సేతువుమీదకు అనేకసార్లు తిరిగింది. ఈ విధంగా సేతువు మీదకు ఇసుక చేరుస్తూ, శ్రీరాముడి సేతువు నిర్మాణంలో తనకు చేతనైనట్టు పాలుపంచుకుంది. పర్వతాలను, అరణ్యాలను సమూలంగా పెకలించి తెస్తూ, ఇసుకను బ్రహ్మాండమైన రాశులుగా తెచ్చిపోస్తున్న వానరులు, ఇసుకలో పొర్లి, ఒంటికి అంటుకున్న ఆ

కాస్త ఇసుకను సేతువు మీద విదిలిస్తున్న ఉడుతను చూసి నవ్వారు. అది చూసి శ్రీరాముడు, 'తన సామర్థ్యంకొద్దీ పనిచేస్తున్న ఆ ఉడుత ధన్యజీవి. ఆ విధంగా, మీ అందరిలో ఎవరైతే గొప్పవాడో, వాడితో ఆ ఉడుత సరిసమానం,' అని వ్యాఖ్యానించాడు. తర్వాత ఆ ఉడుత వీపు మీద ప్రేమతో నిమిరాడు. శ్రీరాముడి వేళ్ళ గుర్తులు ఈ నాటికీ ఉడుత వీపు మీద నిలువు చారలుగా కనిపిస్తాయి" అని చెప్పారు.

అక్కడ జరుగుతున్న వారధి నిర్మాణం బృహత్తరమైన కార్యం అనీ, దానితో పోల్చుకుంటే తాను చేస్తున్న పని కొద్దిపాటిదేనని ఆ ఉడుతకు తెలుసు. అయితే తాను చేయగలిగే కొద్దిపాటి పని వల్ల ఒరిగేదేముందిలే అని ఆ ఉడుత చేతులు ముడుచుకు కూర్చోలేదు. తన వంతు పనిని ఒళ్ళు దాచుకోకుండా చేయడానికి నడుం బిగించింది. ఇదే మనం నేర్చుకోవాలి. ఆ ఉడుతలాగా సామర్థ్యం కొద్దీ పని చెయ్యడమే సంపూర్ణమైన వ్యక్తిత్వానికి వారధి.

## 19. బాధ్యతను చేపట్టగలగాలి

రామలక్ష్మణులు సీతను వెతుకుతూ కిష్కింధ చేరారు. మిత్రులతో, మంత్రులతో కలసి ఋష్యమూక పర్వతం మీద నివసిస్తున్న సుగ్రీవుడు వారిని దూరం నుంచే చూశాడు. చూస్తూనే భయపడిపోయి పరుగు లంకించుకున్నాడు. మిత్రులు,

అనుచరులు అతణ్ణి అనుసరించి పారిపోసాగారు. సుగ్రీవుడు తన మంత్రులతో, "ఆ మహాయోధులను చూశారా! వాళ్ళని తప్పకుండా మా అన్న వాలి పంపించి ఉంటాడు. మునివేషాలతో మనల్ని మోసం చేసి చంపడానికే వాళ్ళు వస్తున్నారు. మనం ఇక్కడ నుంచి త్వరగా పారిపోవాలి!" అన్నాడు. ఇలా అంటూనే మరొక కొండశిఖరం మీదకు పరుగెత్తాడు. అక్కడ కూడా ఆగలేక మరొక కొండ మీదికి వెళ్ళాడు. వెళ్ళేదారిలో పెద్దపెద్ద చెట్లకొమ్మలు విరిచి దారికి అడ్డంగా వేస్తూ పారిపోతున్నాడు.

వాళ్ళు చివరికి ఒక కొండమీద ఆగారు. అప్పుడు సుగ్రీవుడి మంత్రులలో ఒకడైన హనుమంతుడు ఇలా అన్నాడు: "ప్రభూ! మనం చాలాదూరం వచ్చాం. ఇప్పుడు మనకు వాలి వల్ల భయం లేదు. అసలు మీరింత భయపడవలసిన అవసరం లేదు. చంచలమైన మనస్సుతో, కోతిలాంటి స్వభావంతో మీరు భయపడుతున్నారు. రాజు అయినవాడు ఇంత వికలమైన మనస్సుతో ఆలోచించకూడదు. స్థిరమైన బుద్ధితో అనుచరుల చేత అన్ని పనులూ చేయించుకోవలసిన ప్రభువు ఇలా చపలచిత్తుడు కాకూడదు" అని ధైర్యం చెప్పాడు.

సుగ్రీవుని మనస్సులో ఏమేమి భయాలు ఉన్నాయో హనుమంతుడికి బాగా తెలుసు. అందువల్ల సుగ్రీవుడు తన తొందరపాటులో ఎటువంటి పొరపాట్లు చేస్తున్నాడో గ్రహించి

వాటికి చక్కటి నివారణోపాయాలను సూచించాడు. అది కూడా అతడికి కోపం తెప్పించకుండా, 'నేను నీకంటే తెలివిగలవాణ్ణి చూశావా!' అన్నట్టుగా కాక, ఉన్న పరిస్థితిని చక్కగా విశ్లేషించి చెప్పి కర్తవ్య బోధ చేశాడు.

అంతేకాక, 'అది నా పని కాదులే, ఇంతమంది మంత్రులు ఉన్నప్పుడు నేనెందుకు ఈ సలహా చెప్పడం' అని హనుమంతుడు అనుకోలేదు. తన రాజు యొక్క మంచిని కోరి బాధ్యతను తన భుజాలమీద వేసుకున్నాడు. వివేకానంద స్వామి, "బాధ్యత అంతా మీ భుజాల మీదనే ఉంది అని భావించండి, అప్పుడు మాత్రమే మీరు అత్యుత్తమంగా పని చేయగలరు" అని చెప్పారు కదా!

మంచి వ్యక్తిత్వానికి అవసరమైన లక్షణం బాధ్యతను చేపట్టగలగడం. బాధ్యతను తప్పించుకోవాలనుకునేది బానిస మనస్తత్వం. ఎవరినో నీ ఉద్యోగం ఎలా ఉంది అని అడిగితే, "ఉద్యోగం బాగా నచ్చింది కానీ పని చెయ్యడమే కష్టంగా ఉంది!" అని బదులిచ్చాడట. ఉద్యోగం మనకిచ్చే డబ్బు, పేరు ప్రఖ్యాతులు మనకి కావాలి గానీ దానికి తగినట్టుగా పని చెయ్యడం మనకి ఇష్టం ఉండదు.

అందరూ గొప్పగొప్ప ఉద్యోగాలు కావాలని కోరుకుంటారు. అవి ఎలా వస్తాయి? గొప్ప వ్యక్తులం కావాలనుకుంటారు. ఎలా అవుతారు? చాలాసార్లు మనకి ఇష్టం అని చెప్పే పనిని కూడా

చెయ్యడానికి వచ్చేసరికి ఏడుస్తూ, 'ఎందుకు వచ్చిందిరా భగవంతుడా!' అన్నట్టు చేస్తాం. ఇది బానిసల లక్షణం. బానిస తాను చెయ్యాల్సిన పనిని ఏడుస్తూ చేస్తాడు. ఎందుకంటే అతడిలో స్వేచ్ఛ లేదు. మానవ సమాజం భౌతికంగా బానిసత్వాన్ని రూపుమాపినా మనుష్యుల మనస్సులలో నుంచి ఆ బానిస బుద్ధి పోలేదు. వివేకానంద స్వామి ఇలా చెప్పారు, "ఎవడైతే తాను నెరవేర్చవలసి వచ్చిన చిన్న పనిని చెయ్యడానికే ఏడుస్తాడో, వాడు ప్రతి పనికీ ఏడుస్తూనే వుంటాడు. అలా ఎప్పుడూ ఏడుస్తూ వుండి, దుఃఖాలతో నిండిన జీవితాన్ని గడుపుతాడు. అన్నింటిలో వైఫల్యాలనే పొందుతాడు. కానీ, ఎవరైతే తాను నెరవేర్చవలసి వచ్చిన బాధ్యతను సంతోషంగా భుజాలకెత్తుకుని క్రమక్రమంగా చేస్తూ ముందుకు పోతాడో అతడే వికాసాన్ని పొందుతాడు. అతడికే ఇంకాయింకా గొప్ప బాధ్యతలు అప్పగించబడతాయి."

స్వామీజీ పైన చెప్పిన మాటలనే హనుమంతుడు మనకు ఎలా ఆచరించాలో చూపించాడు. అతడు సలహా ఇవ్వడానికి జంకలేదు. తన సలహావల్ల ఎటువంటి పరిణామాలు కలుగుతాయో అని భయపడలేదు. చక్కగా ఆలోచించి, ఇవ్వవలసిన సలహా ఇచ్చాడు. దానివల్ల సుగ్రీవుడికి గొప్ప మేలు కలిగింది అనడంలో సందేహం లేదు.

# 20. మాట్లాడడం ఎలాగో నేర్చుకోవాలి

హనుమంతుడి మాటలు విన్న తర్వాత సుగ్రీవుడి మనస్సు సరిగ్గా ఆలోచించడం మొదలుపెట్టింది. అప్పుడు సుగ్రీవుడు హనుమంతుడితో, "హనుమా! వారిని చూశావా! ఆజాను బాహువులు, విశాలమైన కళ్ళు కలవాళ్ళు. ధనుర్బాణాలు, కత్తులు ధరించి ఉన్నారు. వారిని చూస్తే ఎంతటివారికైనా మనస్సులో భయం కలుగుతుంది. బహుశా వారిద్దరూ మా అన్న వాలిచేత పంపించబడి ఉంటారు. అటువంటి శత్రువులను చూసి జాగ్రత్తపడడం అవసరం కాదంటావా? నువ్వు వెళ్ళి వాళ్ళతో మాట్లాడు! వారు ఇక్కడికి ఎందుకు వచ్చారో, వారి మనస్సులో ఏముందో మనం తెలుసుకోవాలి. నువ్వు వారితో మాట్లాడుతూ ఉన్నంతసేపూ నీ ముఖం నా వైపే ఉండాలి, వెళ్ళి రా!" అన్నాడు.

సుగ్రీవుడు "నీవు వారితో మాట్లాడుతున్నంతసేపూ నీ ముఖం నాకు కనిపిస్తూ ఉండాలి!" అని చెప్పాడు. రామలక్ష్మణులతో మాట్లాడేటప్పుడు హనుమంతుడి ముఖకవళికలు ఎలా మారతాయో తాను చూడాలని సుగ్రీవుడు అనుకున్నాడు. "ఫేస్ ఈజ్ ది ఇన్‌డెక్స్ ఆఫ్ మైండ్" (face is the index of mind) అంటే ముఖం మనస్సుకు సూచిక అన్న సామెత మనందరకూ తెలిసినదే. మన మనస్సులో కలిగే ఆలోచనలు, భయాలు, దిగుళ్ళు మన

ముఖం ద్వారా సులభంగా, ఖచ్చితంగా బయటపడిపోతాయి. ఆ విధంగా సుగ్రీవుడు హనుమంతుడి ముఖాన్ని చదవడం ద్వారా దూరం నుంచే వారి సంభాషణలోని సారాంశాన్నీ, తద్వారా రామలక్ష్మణులు అక్కడకు ఎందుకు వచ్చారో తెలుసుకోవాలనుకున్నాడు.

రామాయణంలో కిష్కింధకాండ, సుందరకాండ, యుద్ధ కాండలు మూడూ చదువుతూ హనుమంతుడు మాట్లాడిన ప్రతి మాటనూ జాగ్రత్తగా గుర్తుంచుకుంటే 'ఎప్పుడు, ఎక్కడ, ఎవరితో, ఎలా మాట్లాడాలి, ఎంత మాట్లాడాలి' అనే విషయం చక్కగా తెలుస్తుంది.

'నోరు మంచిది అయితే ఊరు మంచిది అవుతుంది!' అని సామెత. ఈ విషయం యొక్క అన్ని దృక్కోణాలను వివరించే ఒక మంచి సంస్కృత శ్లోకం ఉంది.

**జిహ్వాగ్రే వర్తతే లక్ష్మీ జిహ్వాగ్రే మిత్రబాంధవాః ।**
**జిహ్వాగ్రే బంధనః ప్రాప్తిః జిహ్వాగ్రే మరణం ధ్రువమ్ ॥**

అన్న శ్లోకంలో నాలుక మీద లక్ష్మీదేవి (అంటే సర్వసంపదలూ కలిగించే శక్తి) నడయాడుతుందనీ, ఆ నాలుక మీదే స్నేహాలు, బంధుత్వాలు పాదుకుని అభివృద్ధి చెందుతాయనీ, ఆ నాలుకను సరిగా వాడకపోతే అదే మనల్ని అష్టకష్టాలలోకి త్రోసివేస్తుందనీ, అదే చివరకు మరణానికి కూడా దారితీయవచ్చుననీ చెప్పబడింది.

కాబట్టి మర్యాద ఉట్టిపడేలా, నిజాయితీతో మాట్లాడడం – అంటే మనసులో ఉన్న మాటనే కల్మషం లేకుండా మాట్లాడడం – అత్యవసరం. అయితే నిజం మాట్లాడుతున్నామనీ, కుండబ్రద్దలు కొట్టినట్టు మాట్లాడతామనీ అనుకుంటూ ఇతరులను నొప్పించేలా ఎంతమాత్రం మాట్లాడకూడదు. దీనికి మరొక అర్థం అత్యంత అవసరమైనప్పుడు మాత్రమే మాట్లాడడం అని కూడా గ్రహించాలి.

సుగ్రీవుని ఆజ్ఞ వింటూనే హనుమంతుడు ఒక భిక్షువు రూపంలో రామలక్ష్మణుల దగ్గరికి వెళ్ళి వారితో, “ఓ సుందర మూర్తులారా! మీరు ఎవరు? ఏ కారణంవల్ల ఈ ప్రాంతాలకు వచ్చారు? నారచీరలు కట్టి, తపస్సు చేసుకునేవారి లాగా వేషం ధరించివున్నా మీ బలం, వీర్యం, పరాక్రమం గొప్పగా కనిపిస్తున్నాయి. ఎంతటి శత్రువునైనా సంహరించగల సామర్థ్యం మీలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. మీరెవరో చెప్పడానికి సంకోచిస్తున్నట్టున్నారు! ఈ ప్రాంతంలో సుగ్రీవుడనే వానరరాజు ఉన్నాడు. ఆయన సత్యధర్మపరుడు. అతడి అన్న వాలి అతణ్ణి అన్యాయంగా రాజ్యభ్రష్టుణ్ణి చేశాడు. నేను సుగ్రీవుడి మంత్రిని. ఆయన మీతో స్నేహం కోరుతున్నాడు. నాకు కామరూపశక్తి (కోరుకున్న రూపాన్ని పొందే శక్తి) ఉంది కనుక నేను ఇలా భిక్షుకరూపంతో వచ్చాను,” అని చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

హనుమంతుడు తన మనస్సులో ఉన్న మాటను వారితో

చెప్పాడు. తానెవ్వరో నిజాన్ని చెప్పివేశాడు. తానెవ్వరో, వారి వద్దకు ఎందుకు వచ్చాడో వారికి తెలియకుండా దాచడానికి ప్రయత్నించలేదు. ఉన్నది ఉన్నట్టు చెప్పి వారి మనస్సును గెలుచుకోవడానికి ప్రయత్నించాడు.

జీవితంలో గొప్ప విజయాలను సాధించిన వారు నిజం మాట్లాడి, ఉన్నదున్నట్లు చెప్పడమే మనకు మరింత ఉపకరిస్తుందని చెపుతారు. అబద్ధం చెపితే దాన్ని కప్పిపుచ్చడానికి మరిన్ని అబద్ధాలు చెప్పవలసి వస్తుంది. ఒకవేళ అప్పటికి పని గడిచినా, తర్వాత అయినా మన అబద్ధం బయటపడితే దాని ఫలితాలు బాగుండవు కదా!

అపరిచితుడైన ఒక వ్యక్తి మీకు తారసపడ్డాడనుకోండి. మీరు అతితెలివి ప్రదర్శిస్తూ, గొప్పకు పోయి అతణ్ణి మోసం చెయ్యడానికి గానీ, అవహేళన చెయ్యడానికి గానీ అబద్ధాలు, మాయమాటలు చెప్పారనుకోండి. తర్వాత కాలంలో నిజం బయటపడినప్పుడు, ఆ వ్యక్తి మీపట్ల ఎటువంటి అభిప్రాయాన్ని ఏర్పరుచుకుంటాడో, దాని ఫలితాలు అతడితో మీ యొక్క సంబంధాన్ని ఎంత ఘోరంగా ప్రభావితం చేస్తాయో ఊహించండి. స్వామీజీ ప్రతి వ్యక్తినీ గౌరవించమనీ, అతడు ఎంత ఘోరమైన మనిషిగా, మొరటు వాడిగా కనిపించినా అతడి మీద నమ్మకం ఉంచమనీ బోధించారు. అవతల వ్యక్తి యొక్క గుణగణాలు తెలియకుండా ముందుగానే

అతడి గురించి ఏదోవొక అభిప్రాయాన్ని ఏర్పరుచుకోవడం మన వ్యక్తిత్వంలో ఒక ఘోరమైన లోపంగా పరిణమిస్తుంది.

హనుమంతుడి మాటలను మౌనంగా విన్న శ్రీరాముడు ఆ కొద్దిమాటల ద్వారా హనుమంతుడి యొక్క మొత్తం వ్యక్తిత్వాన్ని అంచనా వెయ్యగలిగాడు. అంతేకాక అతడి వ్యక్తిత్వాన్ని గురించిన తన విశ్లేషణను లక్ష్మణుడికి వివరించాడు కూడా.

శ్రీరాముడు లక్ష్మణుడితో, "తమ్ముడూ! లక్ష్మణా! మనం కలుసుకోవాలనుకుంటున్న సుగ్రీవుడే తన మంత్రిని మన దగ్గరకు పంపాడు. ఈ హనుమంతుడు ఎంత చక్కగా మాట్లాడాడో చూశావా! ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అధ్యయనం చేయనివాడికి ఇతడిలా మాట్లాడడం సాధ్యం కాదు. ఇతడు వ్యాకరణం చాలాసార్లు చక్కగా చదివి ఉన్నాడని నిశ్చయంగా చెప్పవచ్చు. ఎందుకంటే ఇతడు ఇంతసేపు మాట్లాడినా చిన్న అపశబ్దం కూడా పలకలేదు" అని చెప్పాడు.

వేదాధ్యయనం చెయ్యనివాడికి హనుమంతుడిలా మాట్లాడడం సాధ్యం కాదని శ్రీరాముడు చెప్పాడు. హనుమంతుడు వ్యాకరణం చాలాసార్లు చక్కగా చదివాడనీ, అందువల్లనే అతడి మాటలలో ఎటువంటి అపశబ్దాలూ లేవనీ, శ్రీరాముడు గమనించాడు. మనం మాట్లాడే మాటలు స్పష్టంగా చక్కగా ఉండాలి. వినేవారికి అన్ని మాటలూ పూర్తిగా అర్థం కావాలి. మనం మాట్లాడే భాష

వ్యాకరణబద్ధంగా ఉండాలి. ఇంగ్లీషులో మాట్లాడినా, తెలుగులో మాట్లాడినా వ్యాకరణం సరిగా లేకపోతే అది వినేవారికి ఎలా అర్థం అవుతుంది? వ్యాకరణంలో (గ్రామర్‌లో) తప్పులు ఉంటే అది మన ఉద్దేశ్యాన్నే తారుమారు చేసెయ్యవచ్చు. మీరు మాట్లాడినది అవతలవారికి అర్థం కాకపోతే అది పెద్ద కష్టం. పైగా వ్యతిరేకంగా అర్థం అయితే దాని పరిణామాలు దారుణంగా కూడా ఉండవచ్చు అనడంలో సందేహం ఏముంది? కాబట్టి వ్యాకరణాన్ని నేర్చుకోవడం కోసం ఎంత శ్రమపడ్డా అది ఎప్పటికీ వృథా కాబోదు.

"ప్రిస్టేజ్" అంటే మన్నన, గౌరవం. వాటిని పొందాలంటే సంస్కృత భాషను నేర్చుకోవాలనీ... వేదాధ్యయనం వల్ల మూఢనమ్మకాలు తొలిగిపోతాయనీ స్వామీజీ చెప్పారు. సంస్కృతం కానీ, ఇంగ్లీషు కానీ, తెలుగు కానీ – భాష ఏదైనా సరే – ఆ భాషను స్పష్టంగా పలకడం, ఆ భాషయొక్క నుడికారంలో మాట్లాడడం అభ్యాసం చెయ్యాలి. గొప్ప వక్తలుగా పేరు సంపాదించిన వారందరూ స్పష్టంగా పలకడాన్ని అభ్యాసం చేసినవారే.

ఇంకా శ్రీరాముడు, "ఇతడు మాట్లాడేటప్పుడు ఇతని ముఖంలోగానీ, కన్నులలోగానీ, నుదుటిమీదగానీ, కనుబొమల మీద గానీ, ఇతర అవయవాలలోనూ అనవసరమైన కదలికలేవీ

లేవు. ఎటువంటి దోషమైనా సరే ఏ మాత్రం కనిపించలేదు. ఇతని సంభాషణలో సాగదీసి మాట్లాడడం గానీ, అక్షరాల కోసం, మాటల కోసం తడబడడం గానీ లేవు. ఇతడు మాట్లాడే మాటలు అంత ఆలస్యంగా గానీ, అంత వేగంగా గానీ కాకుండా గుండెలలోనుంచి పుట్టి కంఠంలో మధ్యమస్వరంలో, చెవికి ఇంపుగా వినబడుతున్నాయి. మనస్సులో కల్లాకపటం లేనివాడికే ఇలా మాట్లాడడం సాధ్యమవుతుంది. ఇతడి మాటలు వినేవారికి మంగళకరంగా తోస్తున్నాయి; వారి మనస్సును దోచేలా ఉన్నాయి; చక్కటి అర్థంతో ఎదుటివారికి ఆశ్చర్యాన్ని కలిగించేలా ఉన్నాయి. గుండె, కంఠం, శిరస్సు అనే మూడు స్థానాల ద్వారా స్పష్టంగా పలుకుతూ మాట్లాడుతున్నాడు. కత్తి చేతబట్టి చంపడానికి వచ్చే శత్రువైనా ఇతడి మాటలకి ముగ్ధుడైపోక మానడు" అని చెప్పాడు.

ఇక్కడ హనుమంతుడు మాట్లాడే పద్ధతిలోని మంచి లక్షణాలను శ్రీరాముడు వర్ణించాడు. వాటిని మనం చక్కగా అర్థం చేసుకుని అలా మాట్లాడడాన్ని అభ్యాసం చెయ్యాలి. స్వామీజీ, "మీ బద్ధశత్రువుతోనైనా సరే మంచిగా, మృదువుగా నొప్పి కలిగించకుండా ఉండే భాషను ఉపయోగించి మాట్లాడండి!" అని బోధించారు.

చివరిగా శ్రీరాముడు, "ఓ లక్ష్మణా! ఈ హనుమంతుడు

లాంటి బంటు లేనప్పుడు ఏ రాజు అయినా తన పనుల్ని ఎలా నెరవేర్చుకోగలుగుతాడు? ఏ రాజు దగ్గర ఇటువంటి గుణవంతులు, కార్యసాధకులు అయిన ఉద్యోగులు ఉంటారో ఆ రాజుకు ఎటువంటి శ్రమ ఉండదు. ఆ ఉద్యోగుల సామర్థ్యంతోనే ఆ రాజు అన్నింటిలో విజయం సాధిస్తాడు" అని చెప్పాడు.

మాట్లాడడంలో ఇన్ని మెలకువలు ఉన్నాయి. మన మాటలమీదే మన జీవితాలు ఆధారపడి ఉన్నాయి కాబట్టి సరిగ్గా మాట్లాడడాన్ని నేర్చుకోవడం కోసం ఎంత శ్రమించినా తప్పులేదు, నష్టంలేదు. సరిగా మాట్లాడడాన్ని నేర్చుకోవడమే వ్యక్తిత్వ నిర్మాణంలో అతిముఖ్యమైన అంశం.

## 21. ఇచ్చినమాట నిలబెట్టుకోవాలి

రాముడు వాలిని చంపి సుగ్రీవుణ్ణి రాజుని చేశాడు. సుగ్రీవుడు అంగదుణ్ణి యువరాజుని చేశాడు. ఆపైన సుగ్రీవుడు రాజ్యభోగాలు అనుభవిస్తూ సీతాదేవిని వెదికిస్తానని ఇచ్చిన మాటనే మర్చిపోయాడు. అప్పుడు హనుమంతుడు సుగ్రీవుడికి అతడి కర్తవ్యాన్ని ఇలా గుర్తు చేశాడు.

"ప్రభూ! తమకు రాజ్యం, కీర్తి లభించాయి. ఇంక మిత్రులను ఆదరించి వారికి ఇచ్చిన మాటను నెరవేర్చడమే మిగిలివుంది. దానిని మీరు తప్పక చేయాలి. ఎవరైతే ఏ సమయానికి ఏమి

చెయ్యాలో గుర్తుంచుకుని మిత్రుల విషయంలో వారికి బాధ కలగకుండా ప్రవర్తిస్తారో అటువంటి రాజు యొక్క రాజ్యం, కీర్తి, బలం వృద్ధి పొందుతాయి.”

“ఓ సుగ్రీవా! నువ్వు సదాచార సంపన్నుడివి. సన్మార్గంలో నడిచేవాడివి. కాబట్టి నీవు ప్రతిజ్ఞ చేసిన ప్రకారం నీ మిత్రుడైన రాముడి పనిని చక్కగా నెరవేర్చాలి. ఎవరైతే మిత్రుల మీద గొప్ప ప్రేమతో, ఆదరంతో వారి పనుల్ని ఉత్సాహంతో చేసి పెడతాడో అటువంటివాడు తన సొంత పనులను నిర్లక్ష్యం చేసినా అతడికి చెడు జరగదు. ఎవరైతే మిత్రులకు కావలసిన సహాయాన్ని సరైన సమయంలో అందించకుండా, ఆలస్యంగా సహాయపడతాడో అటువంటివాడు ఎన్ని గొప్పపనులు చేసినా మిత్రులకు ప్రయోజనం కలగదు కాబట్టి మిత్రులకు సహాయం చెయ్యనివాడే అవుతాడు.”

“ప్రభూ! ఇప్పుడు నీవు చేయవలసిన పని సీతాదేవిని వెతికించడం. కాబట్టి వెంటనే సీతాదేవి జాడ కనిపెట్టి, రాముడికి చెప్పి అతడికి సంతోషాన్ని కలిగించు. సీతను వెతికించమని రాముడు గుర్తు చేయక ముందే మనం ఆ పనిని ప్రారంభిస్తే అప్పుడు మనకి ఆలస్యం చేశామన్న నింద రాదు. అతడు గుర్తుచేసిన తర్వాత మనం పని ప్రారంభిస్తే, చేసిన ఆలస్యంవల్ల మిత్రద్రోహం చేసినవాళ్ళమవుతాం.”

"మనం చేసిన వాగ్దానం ప్రకారం స్నేహితుడి పనిని నెరవేర్చవలసిన సమయం దగ్గరకు వచ్చింది. ప్రభువు అయిన వాడు కోశాగారాన్ని, సేనను, మిత్రకోటినీ తనతో సమానంగా చూసుకుంటేనే అభివృద్ధి పొందుతాడు. మిత్రుడికి ఇచ్చిన మాట మరిచిపోతే అన్నీ అనర్థాలే ఎదురవుతాయి. రామచంద్రుని శక్తిసామర్థ్యాలు మనకు తెలుసు. ఆయన ఏ మాటా మళ్ళీమళ్ళీ చెప్పడు. ఆయన చెప్పేవరకూ ఊరుకోవడం మంచిది కాదు, మిత్రులకు మేలు చేయడమే పరమధర్మంగా భావించే మీరు, మీకు ఇంతటి ఉన్నతస్థానాన్ని ప్రసాదించిన ఆ మహాపురుషుడి విషయంలో నిర్లక్ష్యంగా ఉండకూడదు. జానకీదేవి మూడు లోకాలలో ఎక్కడ ఉన్నా వెతికి, ఆమె జాడ తెలుసుకోవడానికి మేము సిద్ధంగా ఉన్నాం. మీ ఆజ్ఞకోసం ఎదురుచూస్తున్నాం" అని హనుమంతుడు సుగ్రీవుడికి హితోపదేశం చేశాడు.

వివేకానంద స్వామి, "నువ్వు ఏదైనా పనిచేస్తానని మాట ఇచ్చినప్పుడు ఖచ్చితంగా దానిని ముందు అనుకున్న సమయానికి చేసి తీరాలి. అలా చెయ్యలేకపోతే తోటివారికి నీ మీద నమ్మకం పోతుంది. డబ్బు వ్యవహారాల లెక్కలు తేల్చడంలో ఆలస్యం ఎంత మాత్రం పనికిరాదు" అని బోధించారు. ఏ సమయంలో ఏ పని చెయ్యాలో దానిని ఏ మాత్రం కాలాతీతం లేకుండా చెయ్యాలి. భగవద్గీతలో నిద్ర, ఆలస్యం, ఏమరుపాటుతనం అనేవి తామసిక

లక్షణాలుగా చెప్పబడ్డాయి. పై మూడింటివల్ల మనం సాధారణంగా చెయ్యవలసిన పనిని సమయానికి చెయ్యలేకపోతాము. ఉరకలు వేసే ఉత్సాహంతో పనిచేసి, పనులను సమయానికి నెరవేర్చినప్పుడే మన వ్యక్తిత్వం గొప్పది అవుతుంది.

అయితే, ఇచ్చిన మాట నిలబెట్టుకోగలిగిన శక్తి మనలో అతి తక్కువశాతం మందికి మాత్రమే ఉంటుంది. అయితే అది వారికి మాత్రమే పరిమితమైన లక్షణం కాదు. ప్రతి ఒక్కరూ దాన్ని అలవరచుకోవచ్చు, అలవరచుకోవాలి కూడా. ఎలా? నిరంతరం అభ్యాసం చెయ్యడం ద్వారా. ఇప్పుడు మనకు ఆ లక్షణం లేదనుకోండి. ఏమి చెయ్యాలి? రోజువారీ పనులలో మనం చేయదలచుకున్న పనులనూ, ఒప్పుకున్న పనులనూ – అవి ఎంత చిన్నవైనా కానివ్వండి – నెమ్మదిగా, వదలకుండా, ఒప్పుకున్న సమయానికి చేస్తూవుంటే మనకు మాట నిలబెట్టుకోవడం అలవాటవుతుంది. ఇదే క్రమక్రమంగా గొప్ప వ్యక్తిత్వానికి పునాదులు వేస్తుంది.

ఇచ్చిన మాట నిలబెట్టుకుని, ఒప్పుకున్న పనిని ఖచ్చితంగా చేసి అందించగల వ్యక్తులు ప్రతి సమాజానికీ అత్యవసరం. వారిమీదే ఆ సమాజం యొక్క భవిష్యత్తు పూర్తిగా ఆధారపడి ఉంటుంది. వారు డాక్టర్లు, ఇంజనీర్లే కావలసిన అవసరం లేదు. తాపీపనివారు,

రిక్షాతొక్కేవారు, టైలర్లు, వంటవారు మరి ఏ వృత్తికి చెందినవారైనా సరే, ఇచ్చిన మాట నిలబెట్టుకుని, ఒప్పుకున్న పనిని సమయానికి చేయగలిగినవారు గొప్ప గౌరవాన్నీ, సంపదనూ పొందగలుగుతారు.

వ్యక్తిత్వం అనేది మనం చేసే వృత్తి మీద కాక మన నిజాయితీ మీద, నిస్వార్థ గుణం మీద మాత్రమే పూర్తిగా ఆధారపడి ఉంటుందని మనం క్షణంపాటైనా మర్చిపోకూడదు.

ఒక కథ చెప్పుకుందాం. జోరున కురిసే వానలో ముగ్గురు వ్యక్తులు ఒక ఇంటి ముందుకు వచ్చి చూరు క్రింద నిలబడ్డారు. వారిని ఇంటిలోకి పిలుద్దామని ఇంట్లో వారు అనుకున్నారు. అయితే ఆ ముగ్గురూ తమ పేర్లు 'నిజాయితీ', 'సంపద', 'ప్రఖ్యాతి' అని చెప్పారు. అంతేకాక తాము ముగ్గురూ కలిసి ఒకేసారి లోనికి రాలేమనీ, ఎవరో ఒకరిని మీరే నిర్ణయించుకుని ఆహ్వానించండి అన్నారట. ఆ ఇంటి యజమాని 'ప్రఖ్యాతి'ని పిలుద్దామని అన్నాడట. అతడి భార్య 'సంపద'ను పిలవాలని కోరిందట. కానీ వారి కోడలు 'నిజాయితీ'ని పిలిస్తే మేలని సలహా ఇచ్చింది. ఈ సలహా అందరికీ నచ్చింది. నిజాయితీని లోపలికి రమ్మని ఆహ్వానించారు. అందరికీ ఆశ్చర్యం కలిగించే విధంగా నిజాయితీతోపాటు సంపద, ప్రఖ్యాతి కూడా ఇంటిలోకి వచ్చారట. అంటే నిజాయితీ ఎక్కడ ఉంటుందో అక్కడ సంపద, ప్రఖ్యాతి

విడువకుండా ఉంటాయని తాత్పర్యం.

"నిస్వార్థమే మనకు ఎక్కువ సంపాదించి పెడుతుంది. జీవితం అనేది ఇచ్చి పుచ్చుకోవడం మీద ఆధారపడి ఉంటుంది. నేను ఇంత పరిమాణం ఇచ్చాను కాబట్టి నాకు అవతలి నుంచి ఖచ్చితంగా ఇంత పరిమాణంలో రావాలి అని లెక్కలు వేసుకుంటూ పనిచేసేవాడు ఏమీ సాధించలేడు. మహాపురుషుల జీవితాలను జాగ్రత్తగా చదివితే వారి జీవితం అంతా ఇతరుల సహాయం కోసమే అర్పించినట్టు స్పష్టంగా కనపడుతుంది. కానీ చివరకు సంపద, ఖ్యాతి వద్దన్నా వచ్చి వాళ్ళ పాదాల ముందు వాలతాయి. నిజానికి జీవితం అంటే ఇవ్వడమే కానీ తీసుకోవడం కాదు" అని వివేకానంద స్వామి చెప్పారు.

## 22. కలిసి పనిచెయ్యగలగాలి

సీతాదేవిని వెతకడానికి సుగ్రీవుడు వానరులను నాలుగు దిక్కులకూ పంపాడు. దక్షిణదిశగా హనుమంతుడితో పాటు నీలుణ్ణి, గజ, గవయ, గవాక్ష, సుషేణ, వృషభ, మైంద, ద్వివిద, విజయ, గంధమాదన, ఉల్కాముఖ, అంగద, జాంబవంతుల్ని పంపాడు. దక్షిణంవైపు వెళ్ళే సేనకు నాయకుడిగా అంగదుణ్ణి నియమించాడు సుగ్రీవుడు. 30 రోజులలో తిరిగి రావాలని గడువు విధించాడు. వారు బయలుదేరే ముందు సుగ్రీవుడు

హనుమంతుణ్ణి పిలిచి, "అంజనీనందనా! నువ్వు ఎక్కడికయినా నిరాఘాటంగా వెళ్ళగలవాడివి. నదుల్ని, సముద్రాల్ని అవలీలగా దాటడంలో నీ తండ్రి వాయుదేవుడితో సమానమైన వాడివి. దేశ, కాలాల గురించి చక్కని అవగాహన ఉన్న నీతికోవిదుడవు నువ్వు! అందుచేత ఈ కార్యభారం నీ మీదే ఉంది!" అని వెన్నుతట్టి పంపించాడు.

మీకు ఒక పని అప్పగించబడింది. అది చాలా కష్టమైన పని. దాని లోతుపాతులు మీకు పూర్తిగా తెలియవు. అయినా సరే దానిని ముందుగా అనుకున్న సమయానికి మీరు పూర్తిచేసి ఫలితాలను అందించాలి. మీరు చేసే పనిని అనుక్షణం గమనిస్తూ, మిమ్మల్ని దోవలో పెట్టే 'సూపర్‌వైజర్' ఎవ్వరూ లేరు. అయినా మీరు ఆ పనిని చక్కగా నెరవేరుస్తారు. మిమ్మల్ని నమ్మి మీకు పనిని అప్పగించిన వారి యొక్క నమ్మకాన్ని వమ్ము చేయరు. ఉన్నతమైన వ్యక్తిత్వానికి ఇది అత్యుత్తమమైన ఉదాహరణ. హనుమంతుడు ఇటువంటి పరిస్థితుల్లో ఆ పనిని నెరవేర్చి చూపాడు. సీతాదేవిని వెదకడంలో హనుమంతుడు చూపిన నైపుణ్యం, చొరవ, సమయస్ఫూర్తి, కార్యదక్షత అటువంటి వ్యక్తిత్వాన్ని మన కళ్ళకు కట్టినట్టు చూపుతాయి.

వానరులు అన్నిచోట్లా వెదుకుతూ చాలా కష్టాలుపడి దక్షిణ సముద్రతీరానికి చేరారు. సుగ్రీవుడు వారికి ఇచ్చిన ముప్పై రోజుల

గడువు కూడా తీరిపోయింది. అప్పుడు యువరాజైన అంగదుడు తన ఎదుట ఉన్న వానరయోధులతో, "సుగ్రీవ మహారాజు మనకు పెట్టిన గడువు ముగిసింది. మనం ఇంకా సీతాదేవి జాడ తెలుసుకోలేకపోయాం. ఇప్పుడు మనం ఆయన ముందు నిలబడితే ఆయన మనందరికీ మరణశిక్ష విధిస్తాడు. ఈ స్థితిలో మనం కిష్కింధకు వెళ్ళి సుగ్రీవుని చేతులలో ప్రాణాలు విడవడంకంటే ఇక్కడే ఉపవాసాలు చేస్తూ ప్రాణత్యాగం చేయడం పరమోత్తమం. సుగ్రీవుడు నన్ను యువరాజపీఠం ఎక్కించాడు కనుక నా మీద ఆయనకు అభిమానం ఉంటుందని మీరు మనస్సులో అనుకోవచ్చు. కాని చిన్ననాటి నుంచీ నేనంటే సుగ్రీవుడికి గిట్టదు. శ్రీరాముడి మాట కాదనలేక నన్ను యువరాజ పదవిలో ఉంచాడు. ఇప్పుడు నేను తన ఆజ్ఞ పాలించనందుకు నన్ను చిత్రహింస చేసి తీరతాడు. ఆ హింస కంటే ఇక్కడే ప్రాణత్యాగం చేయడం మంచిది" అన్నాడు.

హనుమంతుడు అంగదుడి మాటలు విన్నాడు. అక్కడ ఉన్న వానర యోధులతో అరాచకం సృష్టించి, అంగదుడు సుగ్రీవుడి వానరరాజ్యాన్ని హరించవచ్చునని హనుమంతుడికి తోచింది. అంగదుడు వయస్సులో చాలా చిన్నవాడు. దళనాయకుడైన అంగదుడు వానరరాజైన సుగ్రీవుణ్ణి కించపరుస్తూ మాట్లాడడం హనుమంతుడికి రుచించలేదు. సీతాదేవి అన్వేషణ కార్యక్రమం

మధ్యలో ఆగిపోవడాన్ని అతడు నివారించాలని అనుకున్నాడు. ముందుగా 'సామ-దాన-భేద-దండ' అనే ఉపాయాలలో మూడవది అయిన భేదోపాయాన్ని అవలంబించి, తెలివిగా మాట్లాడి సీతాదేవి అన్వేషణకు బయలుదేరిన జట్టు తిరుగుబాటు ఆలోచన చెయ్యకుండా, సుగ్రీవుడికి వ్యతిరేకంగా చీలిపోకుండా ఉండేలా చేశాడు. ముందుగా వానరుల మనస్సులో భేదాన్ని సృష్టించి వారి మనస్సులు మారేలా చేశాడు.

"మనం ఏ పనినైనా ముందూ వెనకా ఆలోచించకుండా చేయకూడదు. సీతాదేవి జాడ సుగ్రీవుడికి తెలపకుండానే మనం మరణిస్తే రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడితో సహా కిష్కింధలోని వారందరూ ప్రాణత్యాగం చేస్తారు. వారి మరణానికి మనమే కారణమవుతాం. పైగా మీ భార్యాపిల్లల గతి ఏమవుతుంది? కాబట్టి మనం ప్రాణత్యాగం చెయ్యడం అనేది సరైన ఆలోచన కాదు" అని హనుమంతుడు వానరులకు హితబోధ చేశాడు.

ఆ తర్వాత హనుమంతుడు దండోపాయాన్ని ఉపయోగించి అంగదుడికి భయం కలిగించి అతడి మనస్సును మార్చాడు. ఇందుకోసం హనుమంతుడు ఆ దళానికి నాయకుడైన అంగదుణ్ణి తనదైన శైలిలో ఓదారుస్తూ, "అంగదా! నువ్వు మీ తండ్రి వాలిని మించిన పరాక్రమం గలవాడివి. ఈ వానర రాజ్యానికి రాజువైతే వాలిని మించిన పాలకుడివి కాగలవు. కానీ నీవు ఒక్క మాట

మరిచిపోతున్నావు. ఈ వానరులకి మనస్సు నిలకడగా ఉండదు. పైగా తమ భార్యాబిడ్డలను కిష్కింధలో వదిలివచ్చారు. వీళ్ళు ఇక్కడ ఎంత కాలం నీ సేవలో ఉండగలరు? అంతేకాక, జాంబవంతుడు, నీలుడు, సుహోత్రుడు, నేను ఎల్లప్పుడూ సుగ్రీవుని సేవలోనే ఉంటాం. మేము ఆయనను విడిచిపెట్టడం అనేది జరగని పని. సుగ్రీవుడి అనంతరం వానరరాజ్యం ఎలాగూ నీకే లభిస్తుంది. ఆయనకు సంతానం లేనప్పుడు ఈ రాజ్యం నీకు కాక ఇంకెవరికి లభిస్తుంది?" అని అంగదుణ్ణి శాంతపరిచాడు.

మొదలుపెట్టిన పనులన్నీ సాఫీగా జరిగిపోతూ ఉంటే ఇంక వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవాల్సిన అవసరం ఏముంది? పైగా నలుగురితో కలిసి పనిచేసేటప్పుడు నాలుగింతలు సమస్యలు ఎదురవుతాయి. పరిస్థితులు ఎలా మారిపోతున్నా అనుకున్న పనిమీద నుంచి మన దృష్టి మరలిపోకుండా ఉంచుకోవడమే కాక జట్టులో మిగిలిన వారి దృష్టిని కూడా దానివైపే మరల్చి చేపట్టిన పనిని కొనసాగించాలి.

చాలాసార్లు, 'రామాయణంలో పిడకల వేట' అన్నట్టు అసలు పని మీదనుంచి మన దృష్టిని మరల్చే రకరకాల పనులు తారసపడుతూ ఉంటాయి. వాటిలో కొన్ని నిజంగానే తలనొప్పిగా తయారవుతాయి. పైపెచ్చు కొందరు ఎదురుపడి, 'నువ్వు చేస్తున్న పని కంటే ఆ పని ఇంకా మంచిది!' అని చెపుతారు. ఇది కూడా ఒక

రకమైన అవరోధమే. ఇలా ఎన్ని అవరోధాలు ఎదురైనా అనుకున్న పనిమీద నుంచి దృష్టి మరలిపోకుండా పని చేయగలిగినవాడి వ్యక్తిత్వమే ఉన్నతమైనది.

## 23. బయటనుండి లభించే సహాయం

హనుమంతుడి మాటలు విని అంగదుడు శాంతపడ్డాడు. ఆ సమయానికి సంపాతి అనే పక్షి అక్కడకు వచ్చాడు. "రావణాసురుడు ఒక అతిలోక సౌందర్యవతిని అపహరించుకుని పోతుండగా తాను చూచానని చెప్పాడు. "ఆమె తన ఆభరణాలు విసిరి పారవేస్తూ, గుండెలు బాదుకుంటూ, 'రామా! రామా!' అని ఏడుస్తున్నది. బహుశా ఆవిడ సీత కావచ్చు" అని వానరులకు చెప్పాడు. సంపాతి వానరులతో, "ఓ వానర వీరులారా! మీ కోసం ఎదురుచూస్తూ ఇక్కడ ఉండమని నన్ను నిశాకర మహర్షి ఆజ్ఞాపించారు. ఆ మహర్షి మాటల ప్రకారమే నేను మిమ్మల్ని కలిశాను. మీరు తప్పక సీతాదేవిని దర్శిస్తారు. ఈ సముద్రాన్ని దాటి లంకకు చేరితే మీకు సీత జాడ తెలుస్తుంది. ఇక నడుము బిగించి పని సాధించండి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

కష్టపడి పనిచేసేవారికి ఎక్కడ నుంచి వచ్చిందో తెలియకుండానే సహాయం లభిస్తుంది. అదే విధంగా సంపాతి వానరులకు దారి చూపించాడు. సీత ఎక్కడ వుందో ఖచ్చితంగా

వారికి చెప్పాడు. అయితే మన సమస్యలకు ఎవ్వరూ పూర్తి పరిష్కారాన్ని చూపలేరు. దానిని మనమే వెదుక్కోవాలి. భయపడి ప్రయోజనం లేదు.

నిజాయితీతో, నిస్వార్థంగా పనిచేసేవాడికి మనస్సులో రకరకాల ఆలోచనలు ఉండవు. ఇది చేస్తే లాభమా, నష్టమా అని నిరంతరం లెక్కలు వేస్తూ కూర్చోడు. అటువంటి వాడి మనస్సు క్రమక్రమంగా గొప్ప పవిత్రతను సంతరించుకుంటుంది. అటువంటి పవిత్రమైన మనస్సే గురువుగా పనిచేసి సమస్యలు ఎదురైనప్పుడు తగిన మార్గాన్ని చూపుతుంది. నిజాయితీగల వ్యక్తులు జీవితంలో నెగ్గుకురావడంలోని రహస్యం ఇదే.

## 24. అగ్నిపరీక్షలను తట్టుకోవాలి

సీతాదేవి జాడ తెలియడంతో రెట్టించిన ఉత్సాహంతో వానరులు సముద్ర తీరాన విడిది చేశారు. కానీ ఉవ్వెత్తున లేచే అలలతో, భీకరమైన ఘోషతో, ఆవలిగట్టు కనిపించని ఆ సముద్రం త్వరలోనే ఆ వానరుల ఉత్సాహాన్ని మింగివేసి, వారి గుండెలలో విషాదాన్ని నింపింది.

ఆ సముద్రాన్ని దాటడం ఎలాగని వానరులు సమాలోచనలు సాగించారు. అంగదుడు వారితో, "ఓ వానరులారా! ఈ నూరు యోజనాల సముద్రాన్ని దాటి లంకలో అడుగుపెట్టి తిరిగిరాగల

వారెవరో ముందుకు రండి. అటువంటి మహావ్యక్తి మనందరికీ ప్రాణదాత. వాడే మనలను కిష్కింధకు తీసుకువెళ్ళి, భార్యాపిల్లలతో సుఖజీవితం సాగించుకునే అవకాశం కల్పిస్తాడు" అన్నాడు. కానీ ఏ ఒక్క వానరుడు కూడా ముందుకు రాలేదు.

అప్పుడు అంగదుడు, "మీలో ఎవరెవరు ఎంతెంత దూరం దూకగలరో చెప్పండి!" అన్నాడు. "నేను పది యోజనాలు దూకగలను" అన్నాడు గజవీరుడు. 'ఇరవై యోజనాల'ని గవాక్షుడు, గవయుడు 'ముప్ఫై యోజనాల'ని, శరభుడు 'నలభై' అని అన్నారు. గంధమాదనుడు మరో పది పెంచాడు, మైందుడు, 'అరవై' అన్నాడు. ద్వివిదుడు, 'డెబ్భై యోజనాలు దూకగలను' అంటే, సుషేణుడు, 'ఎనభై యోజనాలు దూకగలను' అన్నాడు. జాంబవంతుడు, "నేను తొంభై యోజనాలు దాటగలను" అన్నాడు. అంగదుడు, "నేను నూరు యోజనాలూ వెళ్ళగలను. కానీ తిరిగి రాగలనో, లేనో నిశ్చయంగా చెప్పలేను!" అన్నాడు.

అప్పుడు జాంబవంతుడు, "నాయనా! నువ్వు వెళ్ళగలవు - తిరిగి రాగలవు! నూరు కాదు - వెయ్యి యోజనాలు దాటేశక్తి నీకు ఉంది! కానీ, నువ్వు మాకు రాజువి. నువ్వే పనిలోకి దిగవలసినవాడివి కాదు. మేమింతమందిమి ఉండగా నువ్వు వెళ్ళకూడదు!" అన్నాడు. "అయితే మనకు ప్రాయోపవేశమే శరణ్యం. మీరెవరూ వెళ్ళరు, నన్ను వెళ్ళనివ్వరు!" అన్నాడు

అంగదుడు. ఇలా వాళ్ళు ఏమి చెయ్యాలో తేల్చుకోలేని స్థితిలో తర్జనభర్జన పడసాగారు.

వివేకానంద స్వామి, "శాంతితో అలరారే జీవితగమ్యాన్ని చేరుకోవాలంటే, ముందుగా మనిషి ఎంత కల్లోలాన్నీ, ఎన్ని ఉవ్వెత్తున ఎగిసిపడే అలల్నీ ఎదుర్కోవాల్సి ఉంటుందో! ఒక మనిషి ఎంత గొప్పవాడైతే అంత భీకరమైన, ఘోరమైన అగ్నిపరీక్షలను అతడు ఎదుర్కొని ఉండివుంటాడని మనం అర్థం చేసుకోవాలి. తమతమ జీవితాలలో ఏ మాత్రం సాధించి చూపారన్న గీటురాయి మీద అటువంటి వ్యక్తుల జీవితాలు నిగ్గుతేల్చబడ్డాయి. అప్పుడు మాత్రమే ప్రపంచం వారిని గొప్పవారిగా గుర్తించింది. గుండెజారిపోయేవాళ్ళు, పిరికిపందలు, ఎగిసిపడుతున్న సముద్రపు అలల్ని చూసి భయపడిపోయి, పారిపోవడానికి సిద్ధంగా ఉన్న కుక్కపిల్లల లాగా ఒడ్డునే మొరుగుతూ కూర్చుంటారు. వారి మొరుగుళ్ళు ఆ ఒడ్డునే సముద్రపు ఘోషలో వినపడకుండా పోతాయి. అయితే ధీరుడైన వ్యక్తి ఆ అలల్ని ఏ మాత్రం లెక్కచేయడు. ఏది ఎదురైనా సరే నేను కోరుకున్న ఆదర్శాన్ని సాధించి తీరుతానని అనుకుంటాడు. దీనినే 'పురుషకారం' అంటారు. అంటే పౌరుషంతో పనిచెయ్యడం అని అర్థం (స్త్రీలకు కూడా ఇదేమాట వర్తిస్తుంది. ఈ గుణం స్త్రీలకు కూడా కావాలి). ఇలా పౌరుషంతో పనిచెయ్యనప్పుడు ఎంతమంది

దేవుళ్ళ నుంచి ఎంత సహాయం అందినా అది మీలోని జడత్వాన్నీ, సోమరితనాన్నీ వదిలించలేదు" అని చెప్పారు.

హనుమంతుడు సముద్రాన్ని లంఘించే ఘట్టాన్ని మనస్సులో ఉంచుకునే స్వామీజీ ఈ మాటల్ని చెప్పారేమో అనిపిస్తుంది. హనుమంతుడి వ్యక్తిత్వంలో ఈ పురుషకారాన్ని మనం అత్యున్నత స్థితిలో చూడవచ్చు.

ఎవరెస్టు పర్వతాన్ని ఎక్కేవాళ్ళు, సముద్రాన్ని ఈదేవాళ్ళు, పడవలోనో, విమానంలోనో ఒంటరిగా భూగోళాన్ని చుట్టివచ్చే వారి వ్యక్తిత్వాన్ని గురించి ఆలోచించండి. ఈ కాలంలో కూడా మనం వారిలో అటువంటి పురుషకారాన్ని చూడవచ్చు. అటువంటి పౌరుషమే మనకు కావాలి.

## 25. మనలోని శక్తిని గుర్తు చేసుకోవాలి

అలా వానరులంతా ఏమి చెయ్యాలో తెలియని పరిస్థితిలో ఉన్నప్పుడు జాంబవంతుడు వారితో, "ఈ మహత్కార్యాన్ని సాధించగలవాడు మనలోనే ఉన్నాడు. అతణ్ణి ఉత్సాహపరుస్తాను చూడండి!" అని దూరంగా అమాయకంగా కూర్చొని ఉన్న హనుమంతుణ్ణి సమీపించి, "సర్వశాస్త్ర విశారదుడవయిన మహావీరుడా! ఏమిటి నాయనా? ఇటువంటి సమయంలో మాటామంతీ లేకుండా కూర్చున్నావు. నేను గరుత్మంతుణ్ణి

ఎన్నోసార్లు చూశాను. ఆ మహనీయుడి రెక్కలలోని శక్తి నీకు ఉంది. అంతేనా? దేహబలం, బుద్ధిబలం – రెండూ నీ సొంతం. నీ అంత గొప్ప ప్రాణి ఈ భూమండలంలో లేదు. నీవు అంజనాదేవి గర్భాన వాయుదేవుని అంశతో జన్మించావు. నువ్వు పసివాడుగా ఉన్నప్పుడు ఒకనాడు ఆకలివేసి, ఉదయిస్తున్న సూర్యుణ్ణి చూసి పండు అనుకుని, దానిని ఆరగిద్దామని ఎగిరావు. తీక్షణమైన సూర్యుడి వేడి కూడా నిన్ను ఏమీ చేయలేకపోయింది. అది చూసి దేవేంద్రుడు భయపడిపోయి, తన వజ్రాయుధంతో నిన్ను కొట్టాడు. ఆ దెబ్బకు నువ్వు ఒక పర్వతశిఖరం మీద పడ్డావు. అప్పుడు నీ ఎడమ బుగ్గమీద సొట్టపడింది. అందువల్లనే నీకు హనుమంతుడు అని పేరు వచ్చింది. నీకు దెబ్బ తగిలిన సంగతి తెలిసి వాయుదేవుడు కోపంతో అలిగి స్తంభించాడు. ప్రాణవాయువు లేక లోకాలన్నీ తల్లక్రిందులయ్యాయి. అందరూ వాయుదేవుణ్ణి ప్రార్థించారు. అప్పుడు బ్రహ్మ తానుగా దిగివచ్చి, 'ఓ వాయుదేవుడా! నీ బిడ్డకు ఏ అస్త్రం చేతనూ మరణం లేని వరం అనుగ్రహిస్తున్నా'నని వరం ఇచ్చాడు. దేవేంద్రుడు నీకు స్వచ్ఛంద మరణాన్ని ప్రసాదించాడు. అంతటి శక్తిశాలివి అయిన నువ్వు వానరులందరికీ వచ్చిపడిన ఈ కష్టసమయంలో ఏమీ ఎరగనట్టు ఇలా కూర్చుంటే ఎలా! ఇప్పుడు నువ్వే మన వానరసేనని రక్షించాలి, లే!"

"లేవయ్యా! సింహంలాంటి పరాక్రమం గలవాడా! లేచి విజృంభించు! ఈ వానరులందరినీ విషాదసాగరం నుండి ఉద్ధరించడానికి పూనుకొని ఈ సముద్రాన్ని లంఘించు!" అని పొగిడాడు.

జాంబవంతుడు అలా తన గొప్పతనాన్ని పొగుడుతూ ఉంటే హనుమంతుడి గుండెలో సంతోష తరంగాలు ఉప్పొంగాయి. అతడి శరీరం అంతంతగా, మరింతగా పెరగసాగింది. తాడిచెట్ల ఎత్తులో పెరుగుతున్న హనుమంతుడు వానరులందరికీ ఆనందాన్నీ, ఆశ్చర్యాన్నీ కలిగించాడు. ఆపై వానరులందరూ ఆంజనేయుణ్ణి ప్రశంసించసాగారు. దానితో మరింత పెరిగాడు. వృద్ధనాయకులందరికీ అభివాదం చేశాడు.

"ఓ మహనీయులారా! పర్వత శిఖరాలను కంపింప చేయగల బలిష్ఠుడైన వాయువు నా జనకుడు. ఆయన అగ్నిదేవునికి ప్రియమిత్రుడు. ఆయనలాగా ఎగురగలిగిన శక్తితో మేరుపర్వతందాకా ఎన్నిసార్లయినా వెళ్ళి రాగలను. నా బాహువుల వేగంతో పుట్టిన గాలి సముద్రాన్ని కల్లోలం చేయగలదు. గరుత్మంతుడికి సమానమైన వేగంతో నేను ప్రయాణిస్తాను. నా బుద్ధీ, మనస్సూ సీతాదేవిని చూడాలన్న ఉత్కంఠతో ఉన్నాయి. నేను బయలుదేరుతున్నాను. తిరిగివచ్చే వరకూ మీరు నిశ్చింతగా ఉండండి. అవసరమైతే లంకాద్వీపాన్ని

పెకలించి తెచ్చి మీ ముందుంచుతాను" అన్నాడు. హనుమంతుడు ఇలా మాట్లాడుతున్నప్పుడు వానర వీరులు చేసే సింహనాదాలతో ఆ ప్రాంతం హోరెత్తింది. వారు చేసే అట్టహాసాల ముందు సముద్రపు ఘోష వినిపించకుండా పోయింది.

అప్పుడు జాంబవంతుడు: "ఓ వాయునందనా! ఈ వానర వీరులందరి యొక్క శోకాన్ని పటాపంచలు చేసి సంతోషం కలిగేలా చేశావు. నీ శ్రేయస్సు కోరుతూ మన వృద్ధులందరూ ఆశీస్సులు పలుకుతున్నారు. మహర్షుల, గురువుల, వంశపెద్దల ఆశీర్వాదాల తో సముద్రాన్ని లంఘించు. నువ్వు తిరిగి వచ్చే వరకూ మేమిక్కడ నీ కోసం ఎదురుచూస్తూ ఉంటాం. ఇందరి ఆశలూ నీ మీదే ఉన్నాయి. బయలుదేరు, కార్యసాధకుడివిగా తిరిగిరా!" అన్నాడు.

జీవితంలో కొన్నిసార్లు మనమీద మనకే నమ్మకం సన్నగిల్లుతుంది. అటువంటి సమయంలో ఏమి చెయ్యాలి? ఇంతకు ముందు మనం సాధించిన విజయాలను గుర్తు చేసుకోవాలి. మన పూర్వీకుల గొప్పతనాన్ని గుర్తుచేసుకోవాలి. అది మనకు ఉత్సాహాన్ని, స్ఫూర్తిని ఇస్తుంది.

"మీ రక్తనాళాలలో ప్రవహిస్తున్నది గొప్ప మహర్షుల రక్తం అని మీరు ఎల్లప్పుడూ గుర్తుంచుకోండి!" అని స్వామీజీ బోధించారు. అన్నిటికన్నా ఎక్కువగా మనలోని ఆత్మశక్తిని గుర్తు చేసుకోవాలి. మనం అనుకున్నపనిని సాధించగలమన్న నమ్మకాన్నీ, బలాన్నీ

మనకు అందించగలిగే సంకల్పశక్తి ఈ ఆత్మశక్తిని గుర్తుచేసుకోవడం ద్వారానే కలుగుతుంది. మనం ఎంత తరచుగా మన ఆత్మశక్తిని గుర్తుచేసుకుంటే అంత గొప్పగా పనిచెయ్యగలుగుతాం, అంత గొప్ప వ్యక్తిత్వాన్ని నిర్మించుకోగలుగుతాం.

## 26. కష్టాలను ఎదుర్కోవాలి

పనిచెయ్యడంలో ఎదురయ్యే చిక్కుల్ని, కష్టాలను, కడగండ్లను ఎలా ఎదుర్కోవాలో వివేకానంద స్వామి తమ శిష్యులతో సంభాషిస్తున్నప్పుడు సుదీర్ఘంగా వివరించారు. హనుమంతుడి జీవితకథలో వాటన్నిటినీ చక్కగా చూడవచ్చు.

జాంబవంతుడు ఇచ్చిన ప్రేరణతో హనుమంతుడు సముద్రాన్ని లంఘించడానికి వీలుగా మహేంద్రగిరి అనే పర్వతాన్ని ఎక్కి అక్కడ నుంచి గాలిలోకి ఎగిరాడు.

హనుమంతుడు వెళ్ళే దారిలో మైనాక పర్వతం ఉంది. మైనాకుడు సముద్రపు అడుగున ఉన్న ఒక పర్వతం. సముద్రుడి కోరిక మేరకు, హనుమంతుడు కాసేపు తన మీద కూర్చుని విశ్రాంతి తీసుకుంటాడన్న ఉద్దేశ్యంతో మైనాకుడు సముద్రమట్టం పైకి లేచి, ఎత్తుగా పెరిగాడు.

ఇలా ఉన్నట్టుండి పెరిగి తన మార్గంలో అడ్డంగా నిలబడ్డ మైనాకుణ్ణి చూచి హనుమంతుడు, “ఈ పర్వతం ఇలా ఈ

సమయంలో పెరిగి నా త్రోవలో అడ్డంగా నిలబడడానికి ఏ కారణం లేదు కాబట్టి ఇది నా పనికి విఘ్నం కలిగించడానికే వచ్చింది" అని భావించాడు. వాయుదేవుడు ఒక మేఘాన్ని చెల్లాచెదరు చేసినంత సులభంగా, హనుమంతుడు ఎత్తుగా ఉన్న ఆ మైనాక పర్వతాన్ని మహావేగంతో ఎగురుతూ తన ఛాతితో నెట్టి పడవేశాడు.

అప్పుడు మైనాకుడు మానవరూపం ధరించి ఆ పర్వతం మీద నిలబడి, "వానర శ్రేష్ఠుడవైన ఓ హనుమంతుడా! ఎవ్వరూ దాటలేని ఈ సముద్రాన్ని అవలీలగా దాటివేస్తున్నావు. కాసేపు నా శిఖరంమీద ఆగి విశ్రాంతి తీసుకో!" అని ఆహ్వానించాడు.

హనుమంతుడు మైనాకుడితో, "ఓ మైనాకుడా! నీ మాటలతో నేను చాలా సంతోషించాను. నీ మాటలే నాకు ఆతిథ్యం. నీ ఆతిథ్యాన్ని స్వీకరించలేదని బాధపడవద్దు. నేను అత్యంత ముఖ్యమైన పనిని నిర్వర్తించడం కోసం వెడుతున్నాను. నేను ప్రొద్దుపోక మునుపే లంకకు చేరాలి. నేను రాముడు విడిచిన బాణంలాగా ప్రయాణిస్తాను అని ప్రతిజ్ఞ చేశాను. కాబట్టి సముద్రమధ్యంలో నేను ఆగకూడదు!" అని చెప్పాడు. మైనాకుణ్ణి తన చేతితో స్పృశించి, మళ్ళీ ఆకాశంలోకి లేచి తన ప్రయాణాన్ని కొనసాగించాడు.

మైనాకుడు సహాయం చేద్దామన్న ఉద్దేశ్యంతో ఎదురు పడ్డాడు.

కానీ, అతడి ఆతిథ్యంకూడా ఒక అడ్డంకి అవుతుందని హనుమంతుడు భావించాడు. “అవ్వా కావాలి, బువ్వా కావాలి! అంటే కుదరదు” అనే సామెత మనకి తెలుసు. “ప్రతిదీ కావాలనుకునేవాడు దేనినీ పొందలేడు!” అని స్వామీజీ చెప్పారు. ప్రొద్దుపోకమునుపే లంకకు చేరాలి అని హనుమంతుడు చెప్పినప్పుడు మధ్యలో విశ్రాంతి అనేది అవరోధమే అవుతుంది. అందుకనే హనుమంతుడు మైనాకుడి ఆతిథ్యాన్ని స్వీకరించడానికి ఇష్టపడలేదు. అంతేకాక హనుమంతుడు మైనాకుణ్ణి ముందుగా పడద్రోసినా తర్వాత అతడి మనస్సు నొప్పించకుండా సమాధానం చెప్పి తన వ్యక్తిత్వపు గొప్పతనాన్ని మరొకసారి చాటుకున్నాడు.

అప్పుడు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, సర్పాల తల్లి అయిన సురస దగ్గరకు వెళ్ళి, “హనుమంతుడు సముద్రం మీదనుంచి ఎగురుతూ వెళుతున్నాడు. మేము అతణ్ణి పరీక్షించదలుచుకున్నాం. నువ్వు భయంకరమైన కొండలాంటి రాక్షసరూపాన్ని ధరించి ఆకాశంలో అతనికి ఎదురుగా వచ్చి విఘ్నం కల్పించాలి!” అని ప్రార్థించారు.

అప్పుడు సురస భయంకరమైన ఆకారంతో హనుమంతుడికి ఎదురుగా నిలబడి, “ఓరీ! దేవతలు నిన్ను నాకు ఆహారంగా ఇచ్చారు. నేను నిన్ను భక్షిస్తాను. ఇదిగో నా నోటిలో ప్రవేశించు!” అని చెప్పింది. హనుమంతుడు సురస చెప్పిన మాట

విని చేతులు జోడించి సంతోషంతో వెలుగుతున్న ముఖంతో, “అమ్మా! నేను రామకార్యం మీద వెళుతున్నాను. నేను సీతను దర్శించిన తరువాత రాముడికి ఆ వార్త చెప్పి వచ్చి నీకు ఆహారమవుతాను. ఇది సత్యం! నన్ను నమ్ము!” అన్నాడు. అప్పుడు సురస హనుమంతుడితో, “అదంతా నాకు తెలియదు. నువ్వు నన్ను దాటి వెళ్ళలేవు. నా నోటి ముందుకు వచ్చినవాడు నా నోటిలోకి ప్రవేశించి తీరవలసిందే అని బ్రహ్మదేవుడు నాకు వరం ఇచ్చాడు. కాబట్టి నా నోట్లో ప్రవేశించు!” అంది. అప్పుడు హనుమంతుడు తన శరీరాన్ని మరింత పెద్దదిగా పెంచడం మొదలుపెట్టాడు. దానికి తగ్గట్టు సురస తన నోటిని విశాలంగా తెరవసాగింది. అప్పుడు బుద్ధిమంతుడైన హనుమంతుడు, ‘ఇప్పుడు సురస నోరు మిక్కిలి విశాలంగా ఉంది. నా దేహాన్ని చిన్నదిగా చేసి తటాలున ఆమె నోటిలో ప్రవేశించి మళ్ళీ బయటికి వస్తాను’ అని ఆలోచించి తన దేహాన్ని అంగుళమంత చేసుకుని గొప్ప వేగంతో ఆమె నోటి లోపలికి వెళ్ళి బయటకు వచ్చి మళ్ళీ ఆకాశంలో నిలబడి ఆమెతో, “ఓ సురసా! నీకు నమస్కారం. బ్రహ్మ నీకు ఇచ్చిన వరం ప్రకారం నీ నోటిలోకి ప్రవేశించాను. ఇక నన్ను విడిచిపెట్టు!” అని కోరాడు. అప్పుడు సురస సంతోషించి, తన నిజరూపాన్ని ధరించి హనుమంతుని ముందు ప్రత్యక్షమై, “నీకు కార్యసిద్ధి కలుగుతుంది!” అని ఆశీర్వదించింది.

సురస ఎదురుపడిన సంఘటన మైనాకుడు ఎదురైనటు వంటిదే. అయితే సురసను దాటిపోవడం సాధ్యం కాదు. పనిచేసేటప్పుడు మనం కూడా ఇటువంటి అడ్డంకులను ఎదుర్కొంటాం. వాటిని అధిగమించిన తర్వాతే ముందుకు పోగలుగుతాం. అటువంటి పరిస్థితులలో వాటికి వీలైనంత త్వరగా పరిష్కారాన్ని వెదికి ముందుకు సాగడం తప్ప మరొక గత్యంతరం లేదు. హనుమంతుడు అదే చేసి చూపాడు.

హనుమంతుడు తన ప్రయాణాన్ని కొనసాగించాడు. దారిలో సింహిక అనే రాక్షసిని ఎదుర్కొన్నాడు. సముద్రం మీద గాలిలో ఎగిరి వెళ్ళే జంతువుల నీడను పట్టి క్రిందికి లాగే శక్తి ఆ రాక్షసికి ఉంది. ఆ విధంగా పట్టి క్రిందకు ఈడ్చిన జంతువుల్ని తినివేసేది. సింహిక హనుమంతుణ్ణి చూసి, 'నాకు చాలాకాలంగా భోజనం దొరకలేదు. ఇంత కాలానికి ఈ పెద్ద జంతువు నా కంటపడింది. దీనిని తిని నా ఆకలి తీర్చుకుంటాను' అనుకుంది. సింహిక హనుమంతుడి నీడను పట్టి క్రిందికి లాగసాగింది. హనుమంతుడు ఏదో ఒక శక్తి తనను క్రిందకు లాగుతున్నదని గ్రహించాడు. అన్ని దిక్కులా చూడగా పెద్ద జంతువులా ఉన్న సింహిక కనిపించింది. వెంటనే హనుమంతుడికి సింహిక గురించి ఇంతకు ముందు సుగ్రీవుడు తనకు చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది. వెంటనే హనుమంతుడు తన శరీరాన్ని విశాలంగా పెంచాడు. సింహిక

కూడా తన నోటిని తెరవసాగింది. అప్పుడు హనుమంతుడు సింహిక నోటిలో నుంచి చూచి ఆ జీవి ఆయువుపట్టును కనిపెట్టాడు. అంగుళమంత దేహంతో సింహిక నోటిలోకి ప్రవేశించాడు. మనస్సు వేగంతో కదులుతున్న హనుమంతుడు తన కఠినమైన గోళ్ళతో ఈ రాక్షసి ఆయువుపట్టును చీల్చి అది నోరు మూసేలోపలే బయటకు వచ్చాడు. అది చూచిన దేవతలు హనుమంతుణ్ణి, "వానర శ్రేష్ఠుడవైన ఓ హనుమంతుడా! నీలాగా ఎటువంటి కష్టం వచ్చినా మొక్కవోని ధైర్యం, సూక్ష్మదృష్టి, దృఢనిశ్చయం, పని చేయడంలో నేర్పు కలవాడు తన పనులు నెరవేర్చుకోవడంలో శ్రమపడడు. ఇంక నువ్వు కోరిన కార్యం సాధించుకో! నీకు మంగళమవుతుంది" అని పొగిడారు.

సింహిక విషయంలో విఘ్నాన్ని పూర్తిగా నిర్మూలించడం తప్ప మరొక మార్గంలేదు. పైగా సింహిక గురించి హనుమంతుడికి ముందుగానే తెలుసు. "పని సాధించాలంటే మీకు బహుముఖప్రజ్ఞ కావాలి" అని వివేకానంద స్వామి చెప్పారు. రకరకాల విషయాలను గురించి తెలిసి ఉండడం, వాటి గురించి సరైన అవగాహన కలిగి ఉండడం అనే గుణాల ప్రాముఖ్యతను గురించి ఎంత చెప్పినా తక్కువే. అనేక విషయాలను తెలుసుకోవడమే కాక వాటిని దైనందిన జీవితంలో ఎంత చక్కగా ఉపయోగించుకోగలమన్నదే గొప్ప వ్యక్తిత్వానికి సూచిక.

## 27. నిరాశ, నిస్పృహలను అధిగమించాలి

హనుమంతుడు లంకానగరం అంతా ప్రతి అంగుళమూ వెతికాడు. కానీ సీతాదేవి జాడతెలియలేదు. హనుమంతుని మనస్సు నిరాశానిస్పృహలతో నిండిపోయింది. అతడు ఇలా ఆలోచించసాగాడు. "రావణాసురుడి నుంచి తనను తాను రక్షించుకోవడానికి సీతాదేవి ప్రాణత్యాగం చేసిందేమో! ఈ రాక్షసుల భయంకరమైన రూపాలను చూసి ఆమె గుండె ఆగి మరణించలేదు కదా! ఈ పరిస్థితులలో నేను సీతాదేవిని చూడకుండా ఎలా తిరిగివెళ్ళగలను? వేయికళ్ళతో నాకోసం ఎదురుచూస్తున్న అంగదుడికి, ఇతర వానర వీరులకు నా ముఖం ఎలా చూపించగలను? ఏది ఏమైనా సరే, సీతను చూడకుండా లంకను వదలి వెళ్ళను. అసలీ విచారం ఏమిటి? అన్ని అనర్థాలకూ మూలం ఈ నిస్పృహ! దీన్ని వదిలించుకుని మళ్ళీ ఉత్సాహంతో సీతాదేవిని వెతుకుతాను!" అనుకుని రావణాసురుడి అంతఃపురం అంతా మళ్ళీ అంగుళం అంగుళం వెతికి చూశాడు. కానీ సీతాదేవి ఎక్కడా కనిపించలేదు. హనుమంతుని మనస్సు దిగులుతో నిండిపోయింది. అతడు ఇలా ఆలోచించసాగాడు. "సీతాదేవి లంకలో లేదు. రావణాసురుడు బహుశా సీతను తినేసి ఉండవచ్చు. లేదా ఆమె నిరంతరం రాముణ్ణి స్మరిస్తూ ప్రాణాలు

విడిచి ఉండవచ్చు. ఈ వార్త నేను రాముడికి ఎలా చెప్పగలను? 'సీత కనిపించలేదు!' అని నేను చెప్పగానే రామలక్ష్మణులతో పాటు సుగ్రీవుడు, ఇతర వానరవీరులు అందరూ ప్రాణత్యాగం చేస్తారు. ఇంతమంది ప్రాణాలు తియ్యడం కోసమేనా నేను ఇన్ని కష్టాలూ ఓర్చి సముద్రాన్ని దాటింది? నా నిర్ణయం ఒక్కటే. సీత కనిపించకపోతే నేను ఈ లంకనుండి కదలను!" అనుకుంటూ హనుమంతుడు తాను అంతవరకూ చూడని అశోకవనంలోకి ప్రవేశించాడు. అక్కడ సీత కనిపిస్తుందన్న ఆశ అతనిలో అంకురించింది. అనుకున్నట్టుగానే అక్కడ సీతను చూశాడు.

సాధారణంగా మనం జీవితంలో ఎలాంటి నిస్పృహను ఎదుర్కొంటామో అటువంటి పరిస్థితినే హనుమంతుడు కూడా ఎదుర్కొన్నాడు. మనం ఎలా ఆలోచిస్తామో ఆయన కూడా అలాగే ఆలోచించినట్లు మనం స్పష్టంగా చూడవచ్చు. ఒక ప్రక్క సీతాదేవి చనిపోయిందేమో, ఆమెను చూడకుండానే తిరిగి వెళ్ళవలసి వస్తుందేమోనన్న దిగులు మనస్సును కలచి వేస్తున్న సమయంలోనే అటువంటి దిగులు, నిస్పృహ పనికిరావని తనకు తానే సమాధానం చెప్పుకున్నాడు. అంతేకాక తన మనస్సును తనంతట తానే దిటవు చేసుకుని పనిని కొనసాగించాడు. మనం కూడా ఇదే గుణాన్ని అలవరచుకోవాలి. "శక్తి అంతా మీలోనే ఉంది. మీకు కావలసిన శక్తి, సహాయం, ఊరట – అన్నీ మీలోనే

ఉన్నాయి,” అని వివేకానంద స్వామి బోధించారు. సీత కనిపించకపోతే లంక నుంచి కదలను అన్న దృఢనిశ్చయాన్ని హనుమంతుడు మనకు ఆదర్శంగా చూపాడు. సీతను చూసి విజయాన్ని సాధించాడు.

## 28. తోటివారి బాధల్ని మన బాధలుగా చూడగలగాలి

సూర్యోదయానికి ముందు హనుమంతుడు సీతను చూశాడు. ఆమె ఉపవాసాలతో కృశించిన శరీరంతో వడిలి పోయి, దీనమైన ముఖంతో కనిపించింది. అదే సమయానికి రావణాసురుడు అక్కడికి వచ్చి తనను భర్తగా స్వీకరించమని ఆమెకు నయానా భయానా చెప్పడానికి, బెదిరించడానికి ప్రయత్నించసాగాడు. అయితే సీత అతడి మాటలకు లొంగక, “రాముడు త్వరలోనే వచ్చి నిన్ను సంహరించి, నన్ను రక్షిస్తాడు” అని చెప్పింది. రావణాసురుడు, “నీ మనస్సు మార్చుకుని నన్ను భర్తగా స్వీకరించడానికి ఒక నెల మాత్రమే గడువు ఇస్తున్నాను. ఆ తర్వాత నిన్ను వధించి, మాంసంగా వండించుకుని తింటాను” అని బెదిరించి వెళ్ళిపోయాడు.

అప్పుడు హనుమంతుడు, “సర్వలోకాలకూ శుభాన్ని కలిగించే సీతను చూడగలిగాను. నేను ఈమెకు ఎటువంటి అనుమానం కలగని విధంగా మాట్లాడాలి. నన్ను చూచి ఈమె

భయపడి ఏడిస్తే అప్పుడు రాక్షసులు నాతో యుద్ధానికి దిగుతారు. నేను పడిన శ్రమ అంతా వృథా అవుతుంది. నేను సీతను చూసిన సమాచారం రాముడికి అందదు. అందుచేతనే దూతలు సమయానికి తగినట్టు ప్రవర్తించకపోతే సర్వం నాశనం అవుతుంది అని ఆర్యులు చెపుతారు. సీతాదేవి రాముణ్ణి గురించే ఆలోచిస్తున్నది కాబట్టి ఆమె మనస్సుకు నచ్చేలా అతడి గుణగణాలనే కీర్తిస్తూ మాట్లాడడం మొదలు పెడతాను" అని అనుకున్నాడు.

రావణుడు వెళ్ళిపోగానే రాక్షసులు నిద్రలోకి జారుకున్నారు. తాను హఠాత్తుగా ఎదురుపడితే ఆమె భయపడుతుందని హనుమంతుడికి తెలుసు. అందుచేత ముందు రామకథను చెట్టు మీద నుంచే గానం చేశాడు. శ్రీరాముడి పుట్టుకతో మొదలుపెట్టి అతడు ఎలా అడవికి వెళ్ళినదీ, సీతాపహరణం ఎలా జరిగినదీ, రామసుగ్రీవుల మైత్రిని గురించీ చెప్పి, సీతను వెతుకుతూ తాను లంకకు వచ్చానని చెప్పాడు. అది వింటున్న సీతాదేవికి కొంత ధైర్యం వచ్చింది. అప్పుడు చెట్టుదిగి సీతాదేవికి ఎదురుపడ్డాడు. సీతాదేవికి రాముడి ఉంగరాన్ని ఇచ్చి నమ్మకాన్ని కలిగించాడు. త్వరలోనే రాముడు సుగ్రీవుడి యొక్క బ్రహ్మాండమైన వానరసేనతో అక్కడకు వచ్చి ఆమెను రక్షిస్తాడని చెప్పి ఆమెకు ఊరట కలిగించాడు. అది విని సీతాదేవి సంతోషించింది.

బాధలలో ఉన్నవారితో, భయంతో ఉన్నవారితో ఊరడింపు కలిగించేలా మాట్లాడడం చాలా జాగ్రత్తతో చెయ్యవలసిన పని. ముందు వారికి మన ప్రవర్తనతో మనమీద నమ్మకం కలిగించాలి. తర్వాత వారికి ఊరట కలిగేలా మాట్లాడాలి. వారి బాధలను తన బాధలుగా చూడగలిగేవాడే ఆ పని చెయ్యగలడు. వివేకానంద స్వామి "ఎదుటివారి బాధలను మీ బాధలుగా చూడండి" అని చెప్పారు. గొప్ప నిస్వార్థగుణాన్ని కలిగి ఉండడంతోపాటు, గర్వం లేనివారికి మాత్రమే అది సాధ్యమవుతుంది. అంతేకాక ఇది కేవలం నాలుక చివర నుండి మాట్లాడడం ద్వారా సాధ్యపడదనీ, మన చిత్తశుద్ధి, నిజాయితీల లోతులలో నుంచి పలికే పలుకులే అటువంటి ప్రభావాన్ని చూపగలవనీ మనం గుర్తుంచుకోవాలి.

## 29. ముందుచూపు ఉండాలి

సాధారణంగా మనుష్యులందరూ క్షణికమైన ఆవేశంలో పనులు చేస్తారు. ఇప్పుడు చేసే పనివల్ల తర్వాత ఎటువంటి ఫలితాలు వస్తాయోనని ఆలోచించడానికి ప్రయత్నించరు. ఏ పని చెయ్యాలో నిశ్చయించుకునే ముందు దానివల్ల ఎటువంటి ఫలితాలు వస్తాయో ఆలోచించాలి. మనకు అప్పగించిన పనిని చెయ్యడంతోపాటు, దానివల్ల మొత్తం పని మీద ఎటువంటి ప్రభావం కలుగుతుందో ఆలోచించి పని చెయ్యాలి.

సీతను చూసిన తర్వాత హనుమంతుడు ఇలా ఆలోచించాడు. "సీతాదేవిని చూశాను. ఇక రావణాసురుడి మనస్సులో ఏముందో తెలుసుకోవాలి. ఈ విషయంలో సామ, దాన, భేద ఉపాయాలు పనికిరావు. రావణుడు రాక్షసుడు. అందువల్ల అతడిమీద మంచి మాటలతో నచ్చచెప్పడమనే 'సామ' ఉపాయాన్ని ప్రయోగించి ప్రయోజనం ఉండదు. మిక్కిలి ధనవంతుడు కాబట్టి ఏదైనా ఇచ్చి సంతోషపెట్టడమనే 'దాన' ఉపాయం కూడా పనికిరాదు. రావణుడు మహాపరాక్రమవంతుడు. తన అనుచరులు అందరినీ పూర్తిగా తన చెప్పుచేతలలో ఉంచుకున్నాడు. అతడికి ఎదురు తిరిగే శక్తి లంకలో ఎవరికీ లేదు. కాబట్టి రావణుడికి, అతడి అనుచరులకు మధ్య విభేదాలు సృష్టించే భేదం అనే ఉపాయాన్ని కూడా వాడడం కుదరదు. కాబట్టి నాలుగవదైన దండోపాయమే ప్రయోగించవలసి ఉంటుంది. రావణుణ్ణి లొంగదీయడానికి అదొక్కటే పనిచేస్తుందని నాకు తోస్తోంది. ఈ కార్యాన్ని సాధించడానికి పరాక్రమాన్ని చూపడం కన్న వేరే ఉపాయం ఏదీ లేదు. ఇప్పుడు నేను యుద్ధంచేసి కొందరు రాక్షసుల్ని చంపితే ఈ రాక్షసుల బలం కొంచెం తగ్గుతుంది."

"ఎవడు తనకు అప్పగించబడిన పనిని చక్కగా నెరవేర్చడమే కాక, ఆ పనికి అడ్డుపడే ఇతర పనుల్ని కూడా చక్కబెడతాడో వాడే

కార్యదక్షుడు. ఒక గొప్ప పనిని చేపట్టినప్పుడు చాలా కారణాలను మనస్సులో ఉంచుకుంటాం. ఇప్పుడు రావణాసురుణ్ణి ఓడించి, సీతాదేవిని రక్షించడం అనే మహత్కార్యాన్ని సాధించవలసి ఉంది. ఒక్క కారణాన్ని మాత్రమే మనస్సులో ఉంచుకుని పనిచేస్తే చిన్న పనిని కూడా సాధించలేము. ఇక ఇటువంటి మహాకార్యాన్ని ఎలా సాధించగలుగుతాం? కాబట్టి నేను సీతను చూడడంతోనే సరిపెడితే ఫలితం ఏముంటుంది?"

"పైగా ఎవడు ఒక పనిని సాధించడానికి సంబంధించిన నానావిధాల ఉపాయాల్ని తెలిసి ఉంటాడో వాడే పనిని సాధించగలడు కానీ ఇతరులవల్ల కాదు. నేను ఇక్కడే రావణుడి బలమెంతో నిశ్చయంగా తెలుసుకుని, రాక్షసులకు, మా వానరులకు యుద్ధం చేయడంలో ఉన్న తారతమ్యాన్ని (తేడాలను) తెలుసుకుని కిష్కింధకు వెళితే, అప్పుడు సుగ్రీవుడి ఆజ్ఞను చక్కగా నెరవేర్చినవాణ్ణవుతాను."

"ఇప్పుడు నేను రాక్షసులతో యుద్ధం చెయ్యాలంటే ఏమి చెయ్యాలి? యుద్ధం చేస్తేనే కదా రావణుడు తనవారి బలాన్ని, నా బలాన్ని చక్కగా తెలుసుకోగలుగుతాడు! అప్పుడు నేను యుద్ధంలో మంత్రులతోనూ, సేనాధిపతులతోనూ ఉన్న రావణుణ్ణి ఎదుర్కొని అతడి మనస్సులోని భావాన్ని, అతడి బలాన్ని చక్కగా తెలుసుకుని ఇక్కడి నుంచి తిరిగిపోతాను. ఈ అశోకవనం కంటికి, మనస్సుకు

ఆహ్లాదాన్ని కలిగిస్తూ నానారకాల వృక్షాలతోను, తీగెలతోను నందనవనంలాగా కనిపిస్తోంది. ఈ అశోకవనాన్ని నాశనం చేస్తాను. అప్పుడు రావణాసురుడు తన సైన్యాన్ని తప్పక నా మీదకు యుద్ధానికి పంపుతాడు" అనుకున్నాడు. అలా అనుకుని అశోకవనంలోని చెట్లను విరిచి, లతలను త్రెంచివేసి అందమైన ఆ వనాన్ని నాశనం చేశాడు.

ఏ పనిని చెయ్యాలన్నా అన్నివైపుల నుంచీ లోతుగా ఆలోచించి పని చెయ్యాలి. 'అప్పగించిన పనివరకే చేస్తాను! మొత్తం పనితో నాకు సంబంధంలేదు!' అనుకోకూడదు. పని ఎంత పెద్దదైతే అంత స్థాయిలో పనిచెయ్యవలసి ఉంటుంది. "నేను చెప్పే అతి ముఖ్యమైన విషయం ఇది. మీరు కోరుకున్న స్థాయిలో ఫలితాలను రాబట్టడానికి అందుకు తగిన స్థాయిలోనే పనిని కూడా ప్రారంభించాలి" అని స్వామీజీ చెప్పారు. అంతేకాక, "ఏ వ్యక్తి అయితే తానున్న కాలానికంటే సుదూరమైన భవిష్యత్తులోకి తొంగి చూడగలిగి, దానికి తగినట్టుగా ఆలోచించి పనిచేస్తాడో అటువంటివాడు మాత్రమే గొప్ప కార్యాలు సాధించగలుగుతాడు" అని స్వామీజీ చెప్పారు. 'ముందుచూపు' అనేది పుట్టుకతో వచ్చే లక్షణం కాదు. క్రమక్రమంగా దాన్ని అలవరచుకోవాలి.

# 30. చొరవ తీసుకుని పనిచెయ్యాలి

రావణుణ్ణి రెచ్చగొట్టడానికి హనుమంతుడు అశోకవనాన్ని నాశనం చేశాడు. దానితో కోపించిన లంకేశ్వరుడు అనేకమంది రాక్షసుల్ని హనుమంతుడి మీదకు పంపించాడు. వారందరినీ హనుమంతుడు సులభంగా వధించాడు. ఆ తర్వాత ప్రహస్తుడి కొడుకైన జంబుమాలినీ, ఆ తర్వాత ఏడుగురు మంత్రి పుత్రుల్నీ, అనేకమంది సేనానుల్నీ అంతం చేశాడు. దానితో రావణుడు తన కొడుకైన అక్షకుమారుణ్ణి హనుమంతుడి మీదికి యుద్ధానికి పంపాడు. అక్షకుమారుడు మహాపరాక్రమశాలి. గొప్ప విలుకాడు. అతడి శౌర్యాన్ని చూసి హనుమంతుడు ఆశ్చర్యపడ్డాడు. మనస్సులోనే అతణ్ణి మెచ్చుకున్నాడు. "ఈ అక్షకుమారుడు వయస్సులో చిన్నవాడైనప్పటికీ మహాబలశాలి. ఇతణ్ణి ఇప్పుడు నేను చంపకుండా వదిలితే రాబోయే యుద్ధంలో తప్పకుండా వానరసేనకు అపారమైన నష్టాన్ని కలిగిస్తాడు. నిప్పు చిన్నదిగా ఉన్నప్పుడే దానిని ఆర్పివెయ్యాలి. అది పెద్దదైన తర్వాత దానిని చల్లార్చడం కష్టం అవుతుంది. కాబట్టి వీణ్ణి ఇప్పుడే నిర్మూలిస్తాను" అనుకొని అక్షకుమారుడితో గొప్ప యుద్ధంచేసి అతణ్ణి చంపివేశాడు.

ఆ విధంగా హనుమంతుడు లంకలోని రాక్షసుల శక్తిసామర్థ్యాలను చక్కగా తెలుసుకోవడమే కాక, మహాబల

పరాక్రమవంతులైన అనేకమందిని, ముఖ్యంగా జంబుమాలిని, అక్షకుమారుణ్ణి వధించి రాబోయే యుద్ధంలో వానరుల మార్గాన్ని సుగమం చేశాడు.

అక్షకుమారుణ్ణి సంహరించడంలో హనుమంతుడు చొరవ తీసుకుని పనిచెయ్యడానికి సిద్ధపడ్డాడు. "తర్వాత అందరం కలసి యుద్ధానికి వచ్చినప్పుడు చూసుకోవచ్చులే, ఇప్పుడే ఈ పనిని నా నెత్తిమీద వేసుకోవడం ఎందుకు?" అని అనుకోలేదు. సాధారణంగా వ్యక్తులు పనిచెయ్యవలసిన పరిస్థితి ఎదురైనప్పుడు మాత్రమే పనిచేస్తారు. లేకపోతే "తర్వాత చూసుకోవచ్చులే!" అని వాయిదా వేస్తారు. కానీ ఏ పని చెయ్యాలో చక్కగా ఆలోచించి ఆ పనిని తాముగా చేపట్టి చెయ్యడం అనేది గొప్పవ్యక్తుల లక్షణం. స్వామీజీ, 'బాధ్యత అంతా మీ భుజాలమీదే ఉందని అనుకోండి. అప్పుడే మీరు అత్యుత్తమంగా పనిచేయగలుగుతారు" అని బోధించారు.

# 31. ఎదుటివారిలోని గొప్పతనాన్ని గుర్తించగలగాలి

అక్షకుమారుణ్ణి వధించిన తర్వాత రావణుడి పెద్దకొడుకైన ఇంద్రజిత్తు యుద్ధానికి వచ్చి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి హనుమంతుణ్ణి కట్టిపడవేశాడు. రాక్షసులు అతణ్ణి తీసుకుపోయి రావణుడి ముందు నిలబెట్టారు. రావణుణ్ణి చూసి, "ఆ

రాక్షసేశ్వరుని సౌందర్యం, ధైర్యం, శక్తి, బలం, ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. అన్ని మంచి లక్షణాలతో శోభిల్లుతున్న ఈ ప్రభువులో పరస్త్రీ వ్యామోహం అనే ఒక్క చెడ్డగుణం లేకపోతే దేవలోకంతోపాటు దేవేంద్రుడు కూడా ఇతడి పాదాలమీద పడవలసిందే" అనుకున్నాడు.

ఇదే గొప్ప వ్యక్తుల లక్షణం. ఘోరమైన శత్రువులో కూడా గొప్ప లక్షణాలు ఉంటే వాటిని మెచ్చుకోగలగడం హనుమంతుడిలాంటి గొప్ప వ్యక్తులకే చెల్లింది. గొప్ప వ్యక్తిత్వాన్ని కోరుకునే వారందరూ ఈ లక్షణాన్ని అలవరచుకోవాలి.

కానీ దూత అయిన హనుమంతుడు సీతను రాముడికి అప్పగించమని చెప్పిన హితవాక్యాలు నచ్చక రావణుడు అతణ్ణి చంపమని ఆజ్ఞాపించాడు.

## 32. చేసిన తప్పుల్ని ఒప్పుకోగలగాలి

అప్పుడు రావణుడి తమ్ముడైన విభీషణుడు దూతను చంపరాదని చెప్పాడు. వానరులకు అతి ఇష్టమైనది తోక గనుక దానిని తగలబెట్టమని రావణుడు ఆజ్ఞాపించాడు. రాక్షసులు ఆనందంతో హనుమంతుడి తోకకు నిప్పుపెట్టి నగరం అంతా తిప్పారు. హనుమంతుడు నగరం అంతా పరిశీలించి, తన కట్లు తెంపుకుని లంకను కాల్చివేశాడు. 'చూసి రమ్మంటే కాల్చి వచ్చాడు'

అనే సామెత ఇక్కడ నుంచే పుట్టింది. లంకను కాల్చిన తర్వాత ఆ మంటలలో సీతాదేవి కూడా కాలిపోయిందేమోనన్న అనుమానం హనుమంతునికి కలిగింది. అప్పుడు హనుమంతుడు ఇలా ఆలోచించాడు.

"నేనీ లంకాపట్టణాన్ని దహించి ఎంత చెడ్డపని చేశాను! మనిషి కోపాన్ని అణచుకోలేకపోతే ఎన్ని పాపపు పనులైనా చేస్తాడు. కోపాన్ని అదుపు చేసుకోలేనివాడు గురువులను కూడా చంపుతాడు, సత్పురుషులను పరుషమైన మాటలతో తిరస్కరిస్తాడు. కోపానికి బానిస అయిన వ్యక్తికి 'ఇది అనదగినమాట – ఇది అనకూడని మాట' అన్న విచక్షణ ఉండదు. మనిషి కోపానికి లోబడిపోతే ఎంత ఘోరమైన పనైనా చేస్తాడు, ఎంతటి మాటలైనా అంటాడు."

"ఎవరు కోపం వచ్చినప్పుడు, మండుతున్న నిప్పును నీరుచల్లి చల్లార్చినట్లు ఆ కోపాన్ని తన బుద్ధి సహాయంతో నిరోధించుకుంటారో అటువంటి మహాత్ములే మనుష్యులలో ఉత్తములు. పాము తన జీర్ణమైన పాత కుబుసాన్ని విడిచినట్లు తనకు కలిగిన కోపాన్ని ఎవడైతే ఓపికతో అణచుకుంటాడో అతడే 'పురుషుడు' అనబడతాడు." (స్త్రీలకు కూడా ఇదేమాట వర్తిస్తుంది – పురుషకారం లాగానే).

"నేను లంకలో సీత ఉన్నది అన్న విషయాన్ని

ఆలోచించకుండా లంకను తగలబెట్టాను. సీతాదేవికి ఏమి హాని కలిగిందో ఏమో! నేను స్వామిద్రోహిని, సిగ్గులేని వాణ్ణి. నేను కూడా ఈ మంటలలో దూకి కాలిపోతాను" అనుకున్నాడు. ఇంతలో మళ్ళీ, "కానీ ఈ అగ్నిదేవుడు నా తోకనే కాల్చలేదు, కాబట్టి సీతాదేవి తప్పక క్షేమంగా ఉండి ఉంటుంది" అనుకున్నాడు. మళ్ళీ శింశుపావృక్షం క్రింద ఉన్న సీతాదేవి వద్దకు వెళ్ళి, ఆమెకు నమస్కరించి ఆమె క్షేమసమాచారాన్ని అడిగి తెలుసుకుని చాలా సంతోషించాడు.

**"...ఏది ఏమైనా, మనిషి స్వభావంలో ఒక గొప్ప అపాయం ఉంది. అదేమిటంటే, మనిషి ఎప్పటికీ తనను తాను పరీక్షించుకోకపోవడమే!"** అని స్వామీజీ చెప్పారు. మహావ్యక్తులలో కొట్టొచ్చినట్టు కనబడే గుణం ఆత్మపరిశీలన. ఎవరైతే ఆత్మ పరిశీలన ద్వారా తనలోని తప్పుల్ని నిజాయితీతో ఒప్పుకుని వాటిని మళ్ళీ చేయనని నిశ్చయించుకుంటాడో వాడు సాధించలేనిది లేదు. తన తప్పుని తెలుసుకోవడంలో, ఒప్పుకోవడంలో హనుమంతుడు మనకు ఆదర్శప్రాయుడై నిలిచాడు.

కోపాన్ని అణచుకోగలగడం మహావ్యక్తులలో కనిపించే మరొక లక్షణం. "కోపం మహాపాపం. అది ఒక్కొక్కసారి ధర్మబద్ధంగా కనిపించినా సరే, కోపం అనేది అన్ని రూపాలలోనూ పాపమే." అని స్వామీజీ చెప్పారు. "మనలో పెల్లుబికిన కోపాన్ని అణుచుకున్న

ప్రతిసారీ మనలో అంత గొప్ప శక్తి నిక్షిప్తమవుతుంది. ఆ శక్తి మనల్ని మరింత గొప్ప మనుష్యులుగా తీర్చిదిద్దుతుంది. కోపానికి, ద్వేషానికి లోబడిపోయే మనిషి ఏ పనినీ సక్రమంగా చెయ్యలేడు. తనను తాను నాశనం చేసుకుంటాడు. పనికివచ్చే పని ఏదీ చెయ్యలేడు. ఎవరైతే శాంతంగా, అన్నింటినీ సహిస్తూ, మనస్సును సమతూకంలో ఉంచుకుని ఆలోచించగలుగుతారో అటువంటి వారే అందరికన్నా ఎక్కువ పని సాధించగలుగుతారు" అని స్వామీజీ చెప్పారు. కోపంవల్ల కలిగే అనర్థాలను, దాన్ని అణచుకునే పద్ధతిని హనుమంతుడు మనకు ఆచరించి చూపాడు.

## 33. సొంత గొప్పలు చెప్పకూడదు, ఇతరులను కించపరచకూడదు

హనుమంతుడు సీతాదేవి క్షేమసమాచారాన్ని తెలుసుకున్న తర్వాత తిరిగి వెనక్కి వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. అయితే రావణుడితో పోరాడగల శక్తిసామర్థ్యాలు ఆ వానర, భల్లూక వీరులకు ఉన్నాయో లేవోనని సీతాదేవికి అనుమానం కలిగింది. హనుమంతుణ్ణి, "హనుమంతుడా! ఈ సముద్రాన్ని దాటగల శక్తి వాయుదేవునికి, గరుత్మంతుడికి, నీకు మాత్రమే ఉందని నాకు అనిపిస్తోంది. ఇటువంటి సముద్రాన్ని వానరులు ఎలా దాటగలరు. అటువంటి శక్తి వారిలో ఎంతమందికి ఉంది?" అని ప్రశ్నించింది.

ఈ ప్రశ్నకు హనుమంతుడు తన గొప్ప చెప్పుకోకుండా, మిగిలిన వానరుల శక్తియుక్తులను తక్కువచేసి చెప్పకుండా ఇలా సమాధానం చెప్పాడు.

“అమ్మా! ఒక్క సుగ్రీవుడే లంకలోని రాక్షసులనందరినీ చంపగలడు. అతడు వేలకోట్ల వానరులతో అతి త్వరలోనే ఇక్కడికి వస్తాడు. మహాబలవంతులు, మనస్సు కంటే వేగంగా ప్రయాణించగల వానరులు సుగ్రీవుడి ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నారు. వారు ఆకాశంలోను, భూమి మీద, పాతాళంలో కూడా అవలీలగా సంచరించగలరు.”

“సుగ్రీవుని దగ్గర నాకంటే ఎక్కువ శక్తిగలవారు, నాకు సమానమైన శక్తిగల వానరులు చాలామంది ఉన్నారు. వానరసైన్యంలో నాకన్నా తక్కువ బలవంతుడు ఎవ్వరూ లేరు.”

“అమ్మా! ఈ ప్రపంచంలో పని చేయడానికి మొట్టమొదట అందరికంటే తక్కువ శక్తిగలవాళ్ళనే పంపుతారు కదా? సుగ్రీవుని దగ్గర ఉన్నవారిలో అందరికంటే తక్కువ శక్తిగలవాణ్ణైన నేనే ఈ సముద్రాన్ని దాటి రాగలిగాను. కాబట్టి మిగిలిన వానరులు అవలీలగా ఈ సముద్రాన్ని దాటి వచ్చి నిన్ను రక్షిస్తారు.”

హనుమంతుడు తన గొప్ప చెప్పుకోలేదు. తోటివారిని తక్కువ చేసి మాట్లాడలేదు. దీనినే వినయం అంటారు. గొప్ప వ్యక్తిత్వాన్ని అలవరచుకోవడానికి ఇది అత్యవసరం. నేను, నాది అన్న

అహంకారాన్ని పూర్తిగా వదిలించుకున్నప్పుడే ఈ వినయం అలవడుతుంది. 'పళ్ళతో నిండిన చెట్టు క్రిందికి వంగి ఉంటుంది', 'నిండు కుండ తొణకదు' అన్న సామెతలు మనకు తెలిసినవే.

## 34. ఎదుటివారి మనస్సు తెలుసుకుని మాట్లాడాలి

హనుమంతుడు సీతాదేవిని చూసివచ్చి రాముడి ఎదుట నిలబడిన మరుక్షణం 'దృష్టా సీతా!' – 'చూశాను సీతను!' అని చెప్పాడు.

ఆతురతతో ఎదురుచూసే వారితో ఎలా సంభాషణ ప్రారంభించాలో మనం దీనిని బట్టి చక్కగా నేర్చుకోవచ్చు. అటువంటి వారితో విషయాన్ని నాన్చుతూ మాట్లాడకూడదు. రాముడు సీతాదేవిని గురించి అమితమైన ఆందోళనతో ఉన్నాడు. ముందుగా సీత పేరును ఉచ్చరిస్తే చూశాననే విషయం చెప్పేదాకా రాముడు కంగారు పడతాడని, 'చూశాను' అనే మాటతో చెప్పే వాక్యాన్ని ప్రారంభించాడు. ఆపైన 'సీతను' అని చెప్పి తాను వెళ్ళిన పనిని సానుకూలంగా చేసుకుని వచ్చినట్లు తేటతెల్లంగా చెప్పాడు. హనుమంతుడి సంభాషణాచతురతలో ఇది ఇంకొక మణిపూస.

## 35. విశాలమైన మనస్సుతో ఆలోచించడం

విషయాన్ని ఏ మాత్రం తెలుసుకోకుండానే అది మంచి లేక

చెడు అన్న అభిప్రాయాన్ని ముందుగానే మనస్సులో ఏర్పరచుకో కూడదు. విషయాన్ని కూలంకషంగా అన్ని కోణాలలో నుంచీ పరిశీలించిన తర్వాతే దాని మీద ఒక నిర్ణయానికి రావాలి.

విభీషణుడు శరణుకోరి వచ్చిన సందర్భంలో హనుమంతుడు వెల్లడించిన అభిప్రాయం అతడి సూక్ష్మబుద్ధిని, తెరిచిన మనస్సుతో ఆలోచించగలిగే శక్తిని మనకు చూపుతాయి. విభీషణుడికి శరణు ఇవ్వకూడదని వానరసైన్యంలో ఎక్కువమంది అభిప్రాయం. దానితో విభేదిస్తూ హనుమంతుడు ఇలా చెప్పాడు.

"ఓ రామచంద్రా! నువ్వు బుద్ధిమంతులలో ఉత్తముడివి. గొప్ప సమర్థుడివి. ఎంతో చక్కగా మాట్లాడగలిగిన వాడివి. నీకంటే దేవతల గురువైన బృహస్పతి కూడా చక్కగా మాట్లాడలేడు. నేను నా వాదించే శక్తితో ఇతరుల్ని ఓడించాలన్న కోరికతోగానీ, నా గొప్ప చెప్పుకోవాలని గానీ, విభీషణుడంటే ఇష్టపడి గానీ ఇలా చెప్పడం లేదు. నీవు నా మీద ఉంచే గౌరవాన్ని మనస్సులో ఉంచుకుని నాకు తోచినదాన్ని యథార్థంగా చెపుతున్నాను."

"విభీషణుడి గుణాలలో ఏదైనా దోషం ఉందేమో నిర్ధారించుకుని ఆ పైన అతణ్ణి స్వీకరించాలో వద్దో నిర్ణయించాలని మంత్రులు చెప్పారు. ఆ మాట నాకు సరైనదిగా కనపడడం లేదు. ఎందుకంటే ఆచరణలో అలా జరగదు. రాచకార్యంలో ప్రవేశపెడితే (పనిలో ఉంచితే) తప్ప ఒక వ్యక్తిలోని మంచిచెడులు

తెలియవు. మంచిచెడులు తెలియకుండా మనిషిని రాచకార్యంలో ప్రవేశపెట్టడం సరికాదు. అలా ప్రవేశపెట్టినప్పుడు ఆ వ్యక్తి దుష్టుడయితే చేటు తెస్తాడు. కాబట్టి అతడి గుణదోషాల్ని విచారించాలనే సలహా, 'చెట్టు ముందా - విత్తు ముందా?' అన్నట్టుగా ఉంది. కాబట్టి అతడి మంచిచెడులు అంచనా వెయ్యడం ఈ సందర్భంలో కుదరదు."

"గూఢచారులను పంపి రహస్యంగా విభీషణుడి అభిప్రాయం తెలుసుకోవాలని శరభుడు సలహా ఇచ్చాడు. ఆ సలహా ఆచరణ సాధ్యం కాదు. దూరంగా ఉన్న వారి దగ్గరకు రహస్యంగా గూఢచారులను పంపి, వారికి తెలియకుండా వారి హృదయంలోని అభిప్రాయాలను కనుక్కోవచ్చు. కానీ అతి సమీపంలో ఉండి మనల్ని కంటితో చూస్తున్న విభీషణుడి దగ్గరకు గూఢచారులను పంపడం సాధ్యం కాదు."

"విభీషణుడు కాని చోట, కాని సమయంలో వచ్చాడు అన్న అభిప్రాయాన్ని జాంబవంతుడు వెలిబుచ్చాడు. ఆ విషయంలో నేను ఒక మాట చెపుతాను. ఈ చోటు, ఈ కాలం విభీషణుడు రావడానికి తగినవే. అందులో సందేహం లేదు. ఎందుకంటే విభీషణుడు నీలో ఉన్న మంచి గుణాలను, రావణునిలో ఉన్న చెడ్డగుణాలను పోల్చి చూసి నీ శరణు పొందాలని నిర్ణయం తీసుకుని ఉంటాడు. సీతను అపహరించడం, ఎంతమంది ఎన్ని

విధాలుగా చెప్పినా ఆమెను విడిచిపెట్టకపోవడం రావణుడిలో ఉన్న గొప్ప దుర్గుణాలు. నీవు మహావీరులైన ఖరదూషణుల్ని ఒంటరిగా యుద్ధం చేసి చంపావనీ, వాలిని చంపి సుగ్రీవుణ్ణి రాజును చేశావనీ తెలుసుకొని, బుద్ధితో ఆలోచించి, విభీషణుడు రావణుణ్ణి విడిచి నీ వద్దకు వచ్చాడు. ఇది సక్రమంగానే ఉంది. కాబట్టి అతడు సరైన సమయంలో, సరైన చోట నీ శరణుకోరి వచ్చాడు."

"కొందరిని పంపి విభీషణుడి మనస్సు తెలుసుకోవాలని మైందుడు చెప్పాడు. ఆ విషయంలో కూడా నాకు కొంచెం అనుమానం ఉంది. తటాలున పోయి అడిగితే ఏ బుద్ధిమంతుడైనా సరే, 'నా మీద అనుమానంతో వీళ్ళు అడుగుతున్నారు – ఏమి చెపితే ఏమవుతుందో!' అని మాట చెప్పడానికే సంశయిస్తాడు. మరొకవైపు అలా అనుమానంతో అడిగినప్పుడు, అడిగినవాడు మంచివాడే అయినా దుష్టుడుగానే తోస్తాడు. ఒకవేళ అడగగానే అతడు జవాబిచ్చినా, తన అభిప్రాయాన్ని దాచుకునే మాట్లాడతాడు. అందువలన ఎంత సమర్థుడికైనా అటువంటి వాడి హృదయంలో ఏముందో కనిపెట్టడం సాధ్యం కాదు."

"విభీషణుడు మాట్లాడిన మాటలు మనం అందరం విన్నాం కదా! అతని మాటల ద్వారా అతనికి ఏదైనా చెడు ఉద్దేశ్యం ఉన్నట్లు నాకు తోచలేదు. అంతేకాక అతడి ముఖం ప్రసన్నంగా ఉంది. కాబట్టి అతని మీద ఏ మాత్రం సందేహం పెట్టుకోవలసిన

పనిలేదు."

"మనస్సులో చెడు ఉద్దేశ్యం కలవాడు సందేహించకుండా, నిర్భయంగా మన ముందుకు రాలేడు. ఈ విభీషణుడు ఏ మాత్రం సందేహించకుండా, నిర్భయంగా ఉన్నాడు. పైగా అతని మాటలలో ఏ దోషం కనపడడం లేదు. కాబట్టి అతడి మీద నాకు ఏ అనుమానం లేదు."

"ముఖంలో వికారం ఎంత దాచిపెట్టినా దాగదు. బలవంతంగా హృదయంలో దాచిపెట్టుకున్నా సరే మనస్సులోని ఆలోచన తప్పకుండా బయటపడిపోతుంది. దీన్ని మొత్తాన్నిబట్టి చూస్తే మనం విభీషణుడికి ఆశ్రయం ఇవ్వవచ్చును. నేను నా శక్తికొద్దీ, నాకు తోచినవరకూ విభీషణుడి యోగ్యతను గురించి చెప్పాను. ఓ రామా! నేను చెప్పినది విన్నావు కదా! ఇక నీ ఇష్టప్రకారం చెయ్యి" అని హనుమంతుడు రాముడితో చెప్పాడు.

హనుమంతుడు వేర్వేరు వ్యక్తులు చెప్పిన అభిప్రాయాలను 'విశాలమైన మనస్సు'తో తరచిచూచి వాటిలోని లోటుపాట్లను ఎత్తిచూపాడు. ఏ అభిప్రాయాన్ని ఏ వ్యక్తి చెప్పాడో చూడలేదు. ఏయే వ్యక్తులు ఏయే అభిప్రాయాల్ని చెప్పారన్నదాన్ని బట్టి ఆయా అభిప్రాయాలు గొప్పవా కాదా అని చూడలేదు. వారందరి కంటే తాను తెలివిగలవాణ్ణన్న అభిప్రాయం కూడా అతడికి లేదు. కేవలం తాము సాధించదలుచుకున్న పని సక్రమంగా జరగాలన్నదే అతడి

మనస్సులో ఉంది. అందుచేత 'తన' ఆలోచనావిధానంలో నుంచి 'తనను' పూర్తిగా తొలగించి వేశాడు. తన నిస్వార్థబుద్ధితో అందరికన్నా విభిన్నమైన ఆలోచనను వారి ముందు ఉంచగలిగాడు. దానివల్ల వారందరికీ గొప్ప మేలు కలిగింది.

హనుమంతుడు చేసినట్టుగా చెయ్యగలగడం పూర్తిగా స్వేచ్ఛగా ఉన్నవారికే సాధ్యం. వివేకానంద స్వామి ఇలా బోధించారు.

"ఏ మనిషి పూర్తి స్వేచ్ఛతో తాను చేసే పనిని ప్రేమిస్తూ పనిచేస్తాడో అతడు ఫలితాలను ఎంతమాత్రం లెక్కచేయడు. ఒక బానిస కొరడా దెబ్బ పడితేనే పనిచేస్తాడు. ఒక సేవకుడు జీతాన్ని ఆశించి పనిచేస్తాడు. ప్రపంచం తీరే అంత! ఉదాహరణకు వేదికలెక్కి ఉపన్యాసాలు ఇచ్చే ఒక వక్తను చూడండి. అతనికి శ్రోతల చప్పట్లు కావాలి. అవి వినబడకపోతే ఆ వక్తకు ప్రాణాంతకం అవుతుంది. దీనినే బానిస మనస్తత్వంతో పనిచెయ్యడం అని చెప్పుకోవచ్చు. తర్వాత ఒక సేవకుణ్ణి తీసుకోండి. అతడు పనిచెయ్యాలంటే జీతం ఇవ్వాలి. 'నేను నీకు ఇది ఇస్తాను, నువ్వు నాకు అది ఇవ్వు!' – ఇది సేవకుడి మనస్తత్వం. అయితే ఎలా పనిచెయ్యాలి? దేనినీ ఆశించకుండా, చక్కగా పని చెయ్యడమే లక్ష్యంగా, పని మీదున్న ప్రేమతో, పని చెయ్యడం కోసమే పనిచెయ్యాలి. అలా పనిచెయ్యగలిగిన వాడే అద్భుతమైన వ్యక్తిత్వం గలవాడు. అలా పని చెయ్యడం నేర్చుకుంటే

